# శ్రాద్ధము లెందులకుఁ బెట్టవలెను?



గ్రంథకర్త:

చివుకుల అప్పయ్యశాస్త్రి

గర్గభాగవతాది గ్రంథకర్త, దివ్యవాణీ పత్రికాధిపతి

శికింద్రాబాదు.

[మొదటికూర్పు 1000]

ప్రకాశకులు:

శ్రీ రామా బుక్ డిపో,

4000 మార్కెటు స్ట్రీటు,

శికింద్రాబాదు.

1939



[వెల 0—6—0

# విషయసూచిక.



## తర్క ప్రకరణము

# ఉపోద్ఘాతము

నేఁడొకండు హిందూసంఘములో నున్నాఁడా యా సంఘమును వీడినాఁడా యను సంశయమును దేల్పవలసి వచ్చినపుడు మనము చేయు ముఖ్య పరీక్షలలో నాతఁడు శ్రాద్ధము పెట్టవలసినవాఁడైనచో దానిని బెట్టుచున్నాఁడా లేదా యనునది యొకటి. శ్రాద్ధమును వీడినవాఁడు సనాతన హిందు మతమును వీడినవాఁడే యగునని యందఱు నంగీకరించుచున్నారు. అట్లు విసర్జించినవారి సంఖ్య దైవవశమున నింకను మిక్కిలి కొలదిగనే యున్నది. కాని యా కొలదిమందియుఁ దమ ప్రచారము వలన మిగిలిన హిందుసంఘమును దమ వైపునకుఁ ద్రిప్పుకొనుటకు యత్నించుటలో మిక్కిలి కార్యశూరత్వమును గన్పఱుపువారగుటచేతను, కాలమహిమచేఁ బ్రజలకు సహజముగ నధర్మప్రవృత్తి గల్గుచుండుటచేతను నీముఖ్యధర్మమును గాపాడుటకు యత్నించుట సనాతనధర్మనిరతుల కందఱకును బరమకర్తవ్యమై యున్నది. ఏతద్గ్రంథరచనవలన శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు తమ కర్తవ్యము నతి దీక్షతతో నిర్వహించినవారైరి.

### పితృదేవతల ప్రాముఖ్యమును సంస్కర్తలు పారఁదోలఁగలరా?

శ్రాద్ధము జీవిత్పితరుల నుద్దేశించి చేయబడునదే కాని మృతపితరుల నుద్దేశించి చేయబడునది కాదనియు, మృతపితరులను మనము విస్మరింపవచ్చు ననియుఁ జెప్పు నార్యసమాజికుల దుర్వాదమును శ్రీ శాస్త్రిగారి గ్రంథములో సప్రమాణముగను

సయుక్తికముగను ఖండించి యున్నారు. కాని యిట్టి దుర్వా దములవలనను దుష్ప్రచారముల వలనను లక్షలకొలఁది సంవత్స రములనుండి భారతనభోరంగమున సింహాసనాసీనులై మూర్ధాభి షిక్తులైన సమ్రాట్టులవలెఁ బ్రజలచేఁ గొల్వఁబడుచున్న పితరు లకు భ్రష్టత కల్గునను భయ మేరికి నుండనక్కరలేదు. మన పితరులు కేవలము గగనతలముననే యున్నచో దుష్ప్రచార మేఘముల నావరింపఁజేసి ప్రజల దృష్టిపథమునుండి వారిని బోఁద్రోలవచ్చును. కాని వారు మన భరతభూమిలోఁగూడ నచ్చటచ్చట బంధింపఁబడినారు. కాశీ, ప్రయాగ, గయ, బ్రహ్మకపాలము మున్నగు క్షేత్రములు కేవలము దేవతాస్థల ములే కాక పితృస్థలములుగఁగూడ నున్నవి. అచటకుఁ బోయిన వాఁడెవఁడును దేవతలనే కాక పితృదేవతలనుగూడ నారాధింప కుండ రాడు. మన పితరులు మన దేశములోనే కాక మనకాల ములో గూడ బంధింపఁబడినారు. సంవత్సరములో మనకు గల 360 దినములలోను 12 అమావాస్యాదినములును, 2 సంక్ర మణ దినములును, మహాలయపక్షమును నింకను గొన్ని దినము లును గూడ పితరుల కంకితము చేయఁబడినవి. అంతియే కాదు మన నిత్యకృత్యములోఁ గూడఁ బితరులకు స్థానము గలదు. ప్రతిదినమును సంధ్యావందనమునకుఁ బిమ్మట నవశ్యకర్తవ్యము లగు 'పంచమహాయజ్ఞములలోఁ బితృయజ్ఞ మొకటి గదా! తుదకు మానవుని జీవితము లోని ప్రధాన ఘట్టమగు వివాహ ములోఁగూడ హిందువునకుఁ బితరుల పట్లఁగల గౌరవము ప్రతి బింబించుచున్నది. ఎట్లన: వివాహమునకుఁ గల యొక ముఖ్య

ప్రయోజనము సంతానప్రాప్తి పితృఋణ విమోచనముకొఱకే సంతానము ప్రధానముగ నుద్దేశింపబడినది. ఇట్లు నేటికిఁగూడ మన దేశకాలములలోను నాచారవ్యవహారములలోను నత్తుకొని యున్న పితరుల కుద్వాసము చెప్పుట యీ సంస్కర్తలకుఁ దరముగాదనుటను స్పష్టము.

## శ్రాద్ధమునకు నేఁటికిని గల ప్రాముఖ్యము.

పితృకర్మకు మన పూర్వులు శ్రాద్ధమని పేరిడుటలో నెంతయో భవిష్యత్కాలజ్ఞానమును ప్రదర్శించినారని చెప్ప వచ్చును. అట్లు కాదేని వారి సంకల్ప మమోఘముగ ఫలించున దని యైనను జెప్పవలెను. ఏలన: శ్రద్ధతో నీయఁబడున దని (శ్రద్ధయా దీయత ఇతి శ్రాద్ధం) దీని వ్యుత్పత్త్యర్థము. నేఁటివఱకును నింత శ్రద్ధతోఁ జేయఁబడుచున్న కర్మ మఱొకటి లేదు. హిందూమత ధర్మము లనేకములు చాలమందిచే నిరాఘాటముగ నుల్లంఘింపఁబడుచున్న యీదినములలోఁ గూడ నించుమించుగ హిందువు లందఱచేతను నత్యంత శ్రద్ధతో నాచరింపఁ బడుచున్న ధర్మములలో నగ్రగణ్యమైనది శ్రాద్ధవిధి యనియే చెప్పవలెను. సంధ్యావందనాదికము విసర్జించినవారును నభక్ష్యభక్షణాది దోషముల నలవాటుగ నాచరించువారును గూడ శ్రాద్ధదినమునఁ గొంత పరమార్థచింత గల్గి, పవిత్రాచారముల నవలంబించి, నియమనిగ్రహములను గొంతవఱకైనను బొంది యావిధిని నిర్వర్తించుచున్నారు. సంస్కర్తలమని చెప్పు కొనువారు గూడఁ గ్రియలో సాధారణముగ శ్రాద్ధములను విస

ర్జించుట లేదు. ఆస్తికులును, ధర్మనిరతులు నగువారు శ్రాద్ధమునకు ముందుఁ బదిపదునైదు దినములనుండియు నానా డేమివండింపవలెనో యెవరిని భోక్తలనుగఁ బిల్వవలెనో మున్నగు నంశములను గూర్చి యాలోచించికొనుచుఁ గష్టలభ్యములైన కాయగూరలను నాటి కెట్లో సంపాదించి, శుభకార్యములలోఁ గూడ దృష్టములుగా నన్ని వ్యంజనములను, నూరుఁబిండులను, నపూపములను సిద్ధముచేసి భోక్తలను దనిపి యిష్టులతోఁగలసి తాము భుజించుచున్నారు. ఇతర సమయములలో నెన్నడును సంస్కృతము, వేదమంత్రములు వినఁబడని యిండ్లలోఁ గూడ నాడవి వినఁబడును. అంతియేకాదు. ఎల్లప్పుడును శిష్టాచారములతో నుండు గృహములలోఁ గూడ నాడు విశిష్టత్వము గన్పట్టును. ఆచారమున కానాడు పెట్టినది పేరు. కన్యుకతిత్రి, ప్రాలుమాలిక యానాడు మృగ్యములు. 'దేవ పితృకార్యాభ్యాం న ప్రమదితవ్యం' అను శ్రుతివాక్యము పితరులకు సంబంధించినంత వఱకైనను నేటి హిందూసంఘముచే నొదలఁ దాల్పంబడు చున్నది.

### నవీన విజ్ఞానము శ్రాద్ధతత్త్వమునకు వ్యతిరిక్తమా?

నవీన పాశ్చాత్య విజ్ఞానమును బొందిన మనవారు చాల మంది శాస్త్రవిధుల నుల్లంఘించుచుండుట యొకటి గోచరించును. ఏలన:నవీనశాస్త్రములు (సైన్సులు)వృద్ధినొందుచున్నకొలదియు మనపూర్వు లేర్పఱచిన మత విధులలోని ఘనత వెల్లడి యగు చున్నది. ప్రేతాత్మలను గూర్చిన మన మతవిశ్వాసములుగూడ

కాలవశమున పాశ్చాత్యశాస్త్రములచే దృఢపఱుపఁబడినవి. దివ్యజ్ఞాన సమాజమువా రేమి ప్రేతాత్మశాస్త్ర (సైకిక్ సైన్సు) పరిశోధకు లేమి కాలవశమున మన శాస్త్రములలోని సత్యముల నిప్పటికిఁ గనిపెట్టఁగల్గినారు ఇంకను మిగిలిన లోపములను గాలక్రమమున దిద్దుకొనఁ గలరు. గతించిన మన పెద్దలు మనము నాచిపట్లఁ జూపు కృతజ్ఞతకును బూజ్యభావమునకును సంతసింతురని 'సైకిక్‌సైన్సు' వెల్లడిచేయుచున్నది. ఇదివఱలో శ్రాద్ధములవలనఁ బితరుల కానందమెట్లు గల్గునని శంకించువారుగూడ నేఁడు పితరుల నేదోవిధమునఁ బూజింపవలెనని తలచుచున్నారు. కొందఱు నవ్యభావోపేతులు పితరులను దృప్తిపఱచుట తమకు నభిమతమే యనియుఁ గాని పూర్వ వైదిక పద్ధతినే శ్రాద్ధములను బెట్టనక్కఱలేదనియు, నానాడు పితరులను దలచుకొని యెవరికో భోజనము పెట్టినఁ జాలుననియుఁ జెప్పుచున్నారు. కాని మిగిలిన యంశముల నటుంచి నవీన సైకిక్ సైన్సువలనఁ దేలిన మఱొక విషయ మేమనఁగా: సనాతన హిందూమత భావములను గల్గి మరణించినవారికి మాత్రము సనాతన వైదిక పద్ధతిలోఁ జేయఁబడిన శ్రాద్ధమే యానందమును గూర్చునుగాని పాడిపాడిశ్రాద్ధము తృప్తి నొసంగఁజాలదు. దీనినిబట్టియైనను నాధునికభావములు గలవారు తమకు సనాతనమతమందు నమ్మకము లేకపోయినను దమ పితరులను దృప్తిపఱచుటకైనను వైదిక పద్ధతినే శ్రాద్ధముచేయవలెనని తేలుచున్నది. పాశ్చాత్యశాస్త్రము లింతకంటె నెక్కుడు సత్యబోధకములగు కాలము ముందు రాకపోదు. ఇప్పటికే సంస్కృతభాషలోను, వేదమం

త్రములలోను నపూర్వమగు శక్తి గలదని కొందఱు పాశ్చాత్యులు కన్పెట్టినారు. పరిశోధనలు జరిగినకొలదియు మనపూర్వు లేర్పఱచిన శ్రాద్ధవిధిలోని ప్రతి లేశమును సర్థయుక్తమని తేలఁగల దని నమ్ముటకుఁ దగిన యాధారము చాల గలదు. తొందరపడి ధర్మములను పరిత్యజించువారు మాత్రము మున్ముందు పశ్చాత్తాపపడవలసి యుండును.

ఏతద్గ్రంథ ప్రాశస్త్యము

ప్రస్తుతము హిందూ సంఘములో శ్రాద్ధవిషయమున నాల్గువిధములగు ప్రవృత్తి గలవారున్నారు. (1) శ్రాద్ధతత్త్వము నెఱింగి శ్రాద్ధము నాచరించువారు. (2) తత్త్వము నెఱుఁగక శాస్త్రమాదేశించినదని పెద్దలవలన వినియు పూర్వాచారమం దలి గౌరవముచేతను శ్రాద్ధము నాచరించువారు. (3) శ్రాద్ధము లర్థరహితములని తలచియు సంఘ భయముచేతను, నొక్కమారు మార్పును గావించుటకు మనస్సొప్పకుండుట చేతను దాని నాచరించువారు. (4) శ్రాద్ధములను విసర్జించి యితరు లనుగూడ విసర్జింపవలెనని ప్రోత్సహించువారు. శ్రీ శాస్త్రిగారి గ్రంథమీ నాల్గు తరగతులలో మొదటి తరగతి వారికి సన్తోషప్ర దాయకముగను, ద్వితీయ కక్ష్యవారికి బోధకముగను, మూడవ వర్గమువారికి సంస్కారకముగను, తురీయగణమువారికిఁ గంటక ముగను నుండఁగలదు. ఏలన: ఈగ్రంథములో శ్రాద్ధవిధికి సంబంధించిన ప్రమాణవాక్యములు వాని యంతరార్థ వివరణములో గూడ నీయంబడియుండుటయే కాక హేతువాదముచేఁ గూడ

ప్రతిపక్షుల వాదము ఖండింపఁబడినది. సర్వవిధములచేతను శ్రాద్ధావశ్యకత స్థాపింపబడినది. ప్రతిపాద్య విషయమునను బలపఱచుటకై యనేక వాక్యములు వేదములో నుండి యుద్ధరింపబడుట ముఖ్య విశేషము. ఈగ్రంథము పుటల సంఖ్యచే చిన్నదే యైనను విషయప్రాముఖ్య బాహుళ్యముల చేతను, రచనాపాటవముచేతను సద్గ్రంథమని చెప్పఁదగియున్నది. హిందూసంఘమీగ్రంథమువలనఁ బొందఁ దగినంత లాభము బొందఁగలదని యాశించుచున్నాను. ఈ గ్రంథమున కుపోద్ఘాతము వ్రాయు నవకాశము నాకుఁ గల్పించినందులకు శ్రీశాస్త్రిగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

కొవ్వూరు,
17-12-38.

జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.
ప్రిన్సిపల్, సంస్కృతకళాశాల,
కొవ్వూరు.

# పండితవర్యుల అభిప్రాయములు.



బహుధాన్య మార్గశీర్ష బ ౨
రవివారము

శ్రీ ప్రభల లక్ష్మీనరసింహాంపంతులుగారు, బి. యే., బి. యల్.
విశాఖపట్టణము.

వేద ప్రామాణ్యము నంగీకరించుటయం దర్ధజరతీయ న్యాయ మవలంబించి సంప్రదాయానభిజ్ఞులై పెడ త్రోవలఁ జిక్కికొని సరళమార్గము గనజాలని యార్య సామాజికు లనుకంపార్హులు. వారు వేదార్థమును దలక్రిందు గావించి హాస్యాస్పదు లగుచుందురు. శ్రాద్ధముల ప్రయోజనమును గూర్చి వారల యపసిద్ధాంతములను యుక్తిహేత్వాభాసములను, సప్రమాణముగ ఖండించి నిరుత్తరులఁ జేయుచు బ్ర॥ శ్రీ॥ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు ఈ చిన్న గ్రంథమును రచించి యాస్తికుల కృతజ్ఞతా ప్రసంశలకుఁ బాత్రులైరి. గరుడ వరాహ విష్ణు పురాణాదులయందీ విషయము విపులముగఁ జర్చింపఁబడినది. మఱియు దీనిని వివరించు పెక్కు నిబంధన గ్రంథములును గలవు. వాని నన్నిటిఁ గ్రోడీకరించి యొక యుద్గ్రంథముగ రచించిన బాగుగ నుండునని తోఁచుచున్నది. అట్టి ప్రయత్నము నచిరకాలమున జరుగుగాక!

నేఁటికాల మహిమచే ధర్మము తలక్రిందగుచున్నది. దీనికి మూలకారణము ధర్మమూలమగు వేదము పఠింపఁబడకుండుటయే యని తోఁచును. అల్పశ్రుతము ననర్థహేతువే. బాగుగఁ బరిశీలించినచో నేఁటి కనుల మిఱుమిట్లు గొల్పు పాశ్చాత్య విజ్ఞాన మంతయు వేదముయొక్క హాజారమున జోహారు లొనర్చుచుఁ గొలువుండఁ దగినదిగఁ గానవచ్చును.

భూతవిద్య Spiritualism అను నవీన శాస్త్రమును శ్రాద్ధముల మహాత్త్వమును దృఢీకరించుచున్నది. అవివేకముచే శ్రాద్ధముల విడిచి తమ బుద్ధికుశలత కానందించిన కొందఱు పాశ్చాత్య విద్యాదురంధరులు పరీక్షార్థమై యాత్మ్యైక్యమున భూతవిద్యావలంబుల సహాయమునఁ దమ పితరుల నాహ్వానించి వారెట్టు లెచ్చట నున్నదియుఁ బ్రశ్నింప, వారు శ్రాద్ధములలేమి నధోగతి పాలయి యున్నదైన్యమును నట్టి తనయుల కెఱింగించి శ్రాద్ధములఁ బెట్టుఁడని హెచ్చరించిన పిదప నాకొఱంతను దీర్చి వృద్ధితో నాబ్దికములనుజరిపి సన్మార్గవర్తులయిన తనయులు గలరు. వారిని నేను స్వయముగ నెఱుంగుదును.

మఱియుఁ బాశ్చాత్య వాఙ్మయమున మిక్కిలి జాగరూకతతో మానవ జాతి పూర్వవృత్తమును, నాటవికజాతుల యాచారవ్యవహారములును, సూక్ష్మదృష్టినిఁబరీక్షించి వ్రాయఁబడిన పెక్కు సాంఘిక శాస్త్ర గ్రంథములు గలవు. స్పెన్సరు, ఫ్రేజరు, సిగ్మండు ఫ్రాయిడు మొదలగువార లట్టి యుద్గ్రంథములు రచించిరి. వారు వేదపురుషులు గూడ నైనచో సిద్ధాంతములు

భిన్నముగ నుండెడివనియుఁ దోఁచును. కాని వారల కట్టి వేద సహాయ మసంభవము కావున నుభయ విద్యాధురంధరులగు భారతీయులే యీకొఱంతను దీర్పఁదగి యున్నది. లేనియెడల నౌదాసీన్య ముపద్రవములకుఁ గారణమగును.

అస్మదీయులు కొందఱు వేదగ్రంథశూన్యులు విపరీతపు వ్రాతల వ్రాయుచుండిరి. రాజసూయ రహస్యమనునది యుదాహరణము. ధర్మజుఁడు ఛలమున శ్రీకృష్ణుచే యజ్ఞ పశువుగ శిశుపాలుని జంపించె నని యందు వ్రాయఁబడినది. మహాభారత రహస్యమున నది ఖండింపఁ బడినది. కాని యుభయ గ్రంథకర్తలును వేదశ్రౌతసూత్ర సంప్రదాయముల గమనించి యుండలేదు. అట్లు విమర్శించినఁ దత్త్వము తేట పడఁగలదు.

పితృమేధము, నరమేధముయొక్క ఛాయయేమో యను విపరీతాలోచనలును ముందు చేయఁబడఁగలవు.

పవిత్రమగు హిందూవివాహ సంస్కారమును నీవిధమున దూషింపఁబడుచున్నది. పురుషుని పతనమునకు సతి కారణమని బైబిలు నందుఁ గలదు. వేదమునం దట్లుకాక స్వర్గమునకు దారి చూపునది సతియై యున్నది. సమస్తధర్మములకు, యాగ ములకు పత్ని లేనియెడల నధికారము లేదు. చతుర్విధ పురు షార్థములును బత్నీసహాయమునఁ బడయఁ దగియున్నవి. భారతీ యాంగన కామేశ్వరి కాని కామిని గాదు. ఈ రహస్యము నెఱింగియు నెఱుంగఁజాలక నేటి యాందోళనము విజృంభించు చున్నది. మోక్షము కొఱకు వైరాగ్యమును బోధించు స్త్రీ

నిందావాక్యముల తాత్పర్యములే యయి యున్నవి. వైదిక మత మత్యుత్కృష్టమతమని తెల్పుటకు నేఁటి విజ్ఞానమంతయు వినియోగింపఁబడి సర్వజనీన మగునటుల వేదార్థోపబృంహణము లగుట రామేతిహాసములవంటి పెక్కు గ్రంథములు వివిధశాస్త్రజ్ఞులవలన విస్తరించి వ్రాయఁబడవలెను. వేదవ్యాసుని వలె నొక్కనిచే గాకున్నను విద్వత్సభలచే నైన నీమహాత్కార్యము నిర్విఘ్నముగ సాగవలసి యున్నది. పురుషప్రయత్నమునకు ధర్మరక్షకుండగు దైవమును దోడ్పడును.

అంతవఱకు నిట్టి యల్పప్రయత్నముల నైన సర్వజనాదరమును బడసి యజ్ఞానమును గొంతవఱకు నివారింపఁ గలవని నిస్సంశయముగఁ జెల్పవచ్చును. ఇతోధిక యత్నములకు శ్రీ అప్పయ్యశాస్త్రిగారివంటి విద్వాంసు లాంధ్రలోకముచే ప్రోత్సహింపఁబడుదురుగాక.

---

బెజవాడ,
7—12—38.

పణ్డితప్రవర, వ్యాఖ్యావాచస్పతి
బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణమహాగ్నిచిత్తులవారు.

మహాశయా,

తామంపిన శ్రాద్ధఫలవిచారాత్మకమగు పుస్తకము చేరినది. ఇది శ్రుతిస్మృతిపురాణప్రమాణోదాహరణపూర్వకమగుచు సద్యుక్తిశోభితమై మృదుభాషతో నాస్తికుల చిత్తములం దాస్తిక మతబీజములనాటి యంకురింపఁజేయఁగలదని నాతలంపు. ఇట్టి ప్రమాణములకు లొంగని చిత్తముల నీశ్వరుఁడే సరిచేయుగాక.

పాలకొల్లు (పశ్చిమగోదావరి)
13—12—38

ధర్మోపన్యాసకేసరి, విద్వత్కవిరత్న
బ్రహ్మశ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రులుగారు.

తాము పంపిన పైతృకవిమర్శన గ్రంథమును చూచితిని. ఆర్యధర్మధూమకేతువులుగా నార్యదేశమున నేర్పడిన యార్య సామాజికులకు యుక్తివిప్లవముల నాథర్వణికాది మన్త్ర సమూహాభిమన్త్రణపూర్వక సుయుక్త్యభిచార కాండ ప్రయోగమునం గార్యకారణములను రెండింటిని నిర్మూలించుచుం బైతృకకర్మముల నిటుం బ్రతిష్ఠింపం జేయు దమ పొత్త మేధార్మికునకుం దమ దివ్యవాణివలె నానంద జనకముగాదు?

మహాశయా! కలిసైన్యమునం జేరి శ్రీధర్మదేవతపై దండు వెడలుచుంటచే జనించిన మహాపాతకమువలన ఘటశ్రాద్ధార్హులగు వీరు చెప్పుచున్న జీవచ్ఛ్రాద్ధాదుల నిరసించుటలోం దమ పొత్తమొనర్చిన సాహాయ్యము వర్ణనాతీతము. స్వవిగ్రహారాధనతత్పరులై శ్రీ భగవద్విగ్రహారాధన నిరాసక్తులై పరులొక కష్టించి యార్జించిన పితరుల ద్రవ్యమును దమ పొట్టకై వినియోగించికొనుచు నందలి యత్యల్పభాగముచే మృతులగువారికి శ్రాద్ధములం బెట్ట నెగురగొట్టు నీ చెట్టుల మట్టుపెట్టునదని నా యాశయము. ఇట్టివే శ్రీ భగవదనుగ్రహమున మున్ముందును గూడ దివ్యవాణితో నిట్టి దివ్యగ్రంథముల రచించి యాంధ్ర లోకమునంగల కాలేయుల నున్మూలించి శాశ్వతధర్మప్రతిష్ఠనొనర్చునటుల నాశ్రీహరి తమరి ననుగ్రహింపం బ్రార్థించుచున్నాను.

ఓంకారమందిరము
15—12—38

తర్క—వేదాంతవిశారద

బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రులుగారు

బ్ర॥ శ్రీ॥ చివుకుల అప్పయ్యశాస్త్రులుగారిచే రచింపఁబడినాకంపఁబడిన 'శ్రాద్ధము లెందుకుఁబెట్టవలెను' అనుపేరుగల పుస్తకము నామూలాగ్రముగఁ జూచితిని. చాల తృప్తిగానున్నది.

నేఁడు ధర్మమార్గవిశ్వాసము ద్విజులలోఁగూడ కలికాల వశమున నశించినట్లు గాన్పించినను గాయత్రీ యజ్ఞోపవీతాది చిహ్నములతోను, ప్రజాసామాన్యము శ్రాద్ధాది కర్మలతోను ఆస్తికతనామమాత్రముననైన నిలువబడియున్న స్థితిలో ఆర్య సామాజిక సంఘమువారామాత్రపు ధర్మావలంబనము లగు శ్రాద్ధాది చిహ్నముల సహింపక తొలఁగింప బద్ధకంకణులై రనుటకు గుర్తుగా జీవత్పితృశ్రాద్ధములే కర్తవ్యములుగా మృత పితృశ్రాద్ధముల నావశ్యకములని చేసెడి దుష్ప్రచారముల ననేకు లగు ఆస్తిక పండితు లనేకవిధములగు సమాధానములచే ఖండించుచుండిరి. గాని యీగ్రంథముచే సర్వతోముఖముగ నీముఖ్య సమస్యలో ననేకవిధములగు శ్రుతిస్మృతి శిష్టాచారాద్యుపష్టంభకము లగు సద్యుక్తులచే నార్యసామాజిక వాదముల నిర్మూలించి నంతగా నెవ్వరు గూడ ఖండించి యుండలేదని నమ్ముచున్నాఁడ.

ఈగ్రంథము పండితుల కపేక్షితములైన శ్రుత్యాది ప్రమాణములచేతనుఁ మధ్యమాధికారుల కపేక్షితములైన

తత్త్వసామాన్యార్థ నిర్వచనములచేతను, పామర జనులకుఁగూడ సుగమ మగున ట్లనేక లోకగాథోదాహరణముల చేతను గూడ ననేక ముఖ్యాంశములు స్పష్టీకృతమయ్యుండెు. కావున నేఁటి యార్యసామాజిక శ్రాద్ధ దుర్వార దుర్వాద దావానల జ్వాలల నార్పి ధర్మదేవతాప్రశాంతి నెలకొల్పునట్టి యీ గ్రంథ ధారా ధరామృతధారల సర్వులు సేవింపఁ బ్రార్థితులు.

ఇట్టి సద్గ్రంథ నిర్మాణము నినుమడింపఁజేసి శ్రీ శాస్త్రి గారి కాయురారోగ్య దివ్యవిజ్ఞానాది శక్తుల ననంతముగఁగలుగఁ జేయుటకు సర్వశక్తులుగల ధర్మమూర్తియగు భగవానుని బ్రార్థింపుచున్నాఁడ.

---

శికింద్రాబాదు,

**23—12—38.**

"శ్రాద్ధము లెందుకుఁ బెట్టవలె" నను పొత్తమును శ్రద్ధతోఁ బఠించి పరమానందము నందితిని. ఈ గ్రంథరత్న మాంధ్ర భారతికి నొక నూత్నాభరణ మని చెప్పక తప్పదు.

సనాతనాచారములను నిష్కారణముగ నాక్షేపించు సోదరులీ పొత్తమును చిత్తగించవలసియున్నది. ఆస్తికులకు నవశ్య పాఠ్యమని వేర వ్రాయవలెనా?

శ్రుతిస్మృతి పురాణ సూత్రేతిహాసములతోడనే కాక లోకోక్తి యుక్తులచేతను, శ్రాద్ధతత్త్వము సులభముగఁ బ్రతిపా దింపఁ బడినది. గ్రంథరచనావిధానమును పరిశీలించుచో నీ

'ప్లాటు' ననుసరించి యాంధ్రాంగ్లభాషలలో నొక మహాగ్రంథ మును విస్తరింపవచ్చునేమో? విజ్ఞులు ప్రమాణము.

సార్థకమును, సమర్థకమును నగు గ్రంథమును రచించి నందులకు శ్రీ శాస్త్రిగారి నభినందించుచున్నాను.

చి॥ మ॥ వీరభద్రశర్మ,

వేద, కావ్య, స్మృతితీర్థ, ధర్మాచార్య, విద్యానిధి, విద్యారత్న,

అధ్యక్షుఁడు — వీరశైవ గురుకులము.

సంస్థాపకుఁడు — శైవభారతీభవనము.

విద్వచ్చూడామణి బ్రహ్మశ్రీ కురుగంటి వేంకటరమణశాస్త్రులుగారు

---

శ్రీ సుందరీవిలాస సంస్కృత పాఠశాలా

వేమూరు, (తెనాలి తా)

భో భో మహాశయాః!

యుష్మాభిస్సంప్రేషితోఽయం శ్రాద్ధకైమర్థ్య మీమాంసా నామకో గ్రంథః లబ్ధో మయా దృష్టశ్చామూలాగ్రం ప్రాపితో విమర్శపదవీం. నిరూపిత స్వప్రమాణత్వేన. సయుక్తికత్వేన నిశ్చితశ్చాజ్ఞానాం సంశయ విపర్యయ గ్రస్తానామాస్తికానాం శ్రాద్ధవిషయిక సంశయాది నిరాసకత్వేన తజ్ఞానాం విశ్వాసోద్బల కత్వేన చ నిర్ణీతః. కువాదినాం ప్రమాణోదాహరణ నిరూప ణేన మూకీకరణాయాలమిత్యనుమోదితశ్చ విద్వద్భిరాస్తికై రానందితశ్చాస్మాభిరాదరణపూర్వకం గమితశ్చ పరాం కోటిం ప్రమాణైః ప్రత్యక్షాభిరితి జ్ఞాపయంత్వాముమర్థింలోకాయ.

హైద్రాబాదు.
8–1–39.

శ్రీ కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ. నైజాంకాలేజి.

'ధర్మము వర్ధిల్లుగాక'

'సాగ్రధర్మముఁ విమల సత్యము పాపముచేత బొంకుచేఁ
బారము నొందలేక చెడబాలిని యైన యవస్థ దక్షులై
వ్వార లుపేక్షచేసినను వారలచేటగుగాక ధర్మని
స్తారకమయ్యు సత్యఫలదాయక మయ్యును దైవముండెడిఁ'

[మహాభారతము]

పాపముచే ధర్మ ముత్పన్న మగుచున్న యీకాలమం దన ధర్మప్రచారము ప్రతిధార్మికునకును ధర్మమగుచున్నది. కర్మసిద్ధాంతము, జన్మాంతరము, మూలసూత్రములలోనివగు నీ సనాతనార్య మతసంప్రదాయమున పితృకర్మ యొక ధర్మము. అట్టి ధర్మము నేల యాచరింపవలెనో సహేతుకముగా నిర్ణయించు నీగ్రంథముయొక్క యావశ్యకత వేరుగాచెప్ప నవసరము లేదు, ధర్మహాని గలుగకుండ యత్నించుటకు సమర్థులగువారు దానిని చేయకపోయిన వానికి చేటు మూడును.

సనాతనార్యసంప్రదాయములకు మిక్కిలి హాని గలుగుచున్నది, నాయకులనువారు ప్రజాస్వామ్య మను మిషచే ననూచాన సంప్రదాయములను బుద్ధిపూర్వకముగా నణచివేయుచున్నారు. ధార్మికుల మొర లరణ్యారోదనము లగుచున్నవి ఇట్టి సమయమున సందేహములుగల యల్పసంఖ్యాకుల కైనన

సందేహములు తీర్చి వారియందు సంప్రదాయమునెడల ప్రత్యయము కలుగజేయ ప్రయత్నించుట విధి. అట్టి విధి నీగ్రంథము నిర్వర్తించుచున్నది. ధర్మదేవత తప్పక ధర్మము నుద్ధరింపఁ గలదని నమ్మువారలలో నేనొకఁడను. ధర్మహాని కలుగకుండ రాజకీయస్వాతంత్ర్యమును సంపాదింపవచ్చునని నానమ్మకము. రాజకీయమునకు మతమునందు జోక్యముండరాదు. ప్రస్తుతము ప్రపంచమునందంతట నమలులోనున్న యీసూత్రము హిందూ దేశమునందలి నాయకమ్మన్యులకు గిట్టకుండ నున్నది.

ఒక్క విషయము మాత్రము చెప్పవలసి యున్నది. గ్రంథనామము పఠనమునకు ప్రేరకముగలేదు. దానిని మార్చిన తప్పక యీగ్రంథము బహుజనులు చదువుదురని విశ్వసించుచున్నాను.

---

శ్రీ పరమేశ్వరాయనమః.

# విన్నపము.

ఈ పుస్తకమితఃపూర్వమే సనాతనమతప్రచారిణీ పత్రిక యందుఁ బ్రకటింపఁబడినది. ఆస్తికులగువారిద్దానిని బ్రత్యేకగ్రంథముగా బ్రచురించిన లోకోపకారము గాఁగలదని ప్రోత్సహించిరి. అందులకు ధర్మతత్పరులును భాషాభిమానులు నగు శ్రీ రామాబుక్ డిపో ప్రొప్రయిటరు మహారాజశ్రీ పబ్బా శంకరయ్యగారును వీరిననుసరించినట్టి శ్రీ నీలా రాజయ్య (మానేజరు) గారు నన్ను ప్రేరేపించి యీ మొదటి కూర్పునకు మాత్రము ప్రకటనాధికారమును బొంది ప్రత్యేక గ్రంథముగాఁ దీసి ప్రకటించి యాస్తికజన కృతజ్ఞతాపాత్రులైరి. దీనికి వేద శాస్త్రపారంగతులును, యుక్తివిశారదేత్యాది బిరుదాంకితులు నగు శ్రీ కాలూ రామశాస్త్రిగారు (కాన్పూరు) శ్రాద్ధనిర్ణయ మనెడి గ్రంథము మాతృకయైనందువలన శ్రీ శాస్త్రిగారికిని బ్రత్యేక గ్రంథముగాఁ బ్రకటించిన శ్రీ శంకరయ్యగారికిని విశేషాంశములతో నుపోద్ఘాతము వ్రాసిన శ్రీ కొవ్వూరు సంస్కృత కాలేజి ప్రిన్సిపాలు జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ గారికిని దమ యభిప్రాయముల నొసంగిన పండితవరులకును గృతజ్ఞతా పూర్వక ధన్యవాదము లర్పించుచున్నాఁడను.

'శ్రాద్ధమెందులకుఁ బెట్టవలెను?' అనెడి నామము దీనికిఁ బెట్టుటకు గారణమేమన, నాస్తికులనైతమీ పుస్తకగ్రహణేచ్ఛ

గలిగి గ్రహించి యిందలి విషయము బోధమైయాస్తికభావము గలుగునేమోయని విన్నవించుచున్నాను. ఇది యెంతవరకు నెరవేరునో చూడవలసి యున్నది.

ఇందలి యక్షరస్ఖాలిత్యములను సవరించుకొని పఠించెడి భారము పాఠకులపైఁ బెట్టినందులకు మన్నింపఁ బ్రార్థితులు.

సికింద్రాబాదు,
9—1—39.

విబుధవిధేయుఁడు,
చివుకుల అప్పయ్యశాస్త్రి.

శ్రీపరమేశ్వరాయనమః

# శ్రాద్ధము లెందుకుఁ బెట్టవలె?



శ్లో॥ యేనోద్ధృతా వసుమతీ సలిలే నిమగ్నా
నగ్నాచ పాండవవధూస్థగితా దుకూలైః
సమ్మోచితో జలచరస్య ముఖా ద్గజేంద్రో
దృగ్గోచరో భవతు మే౽ద్యసవీఃబంధుః॥
పూజ్యస్య పుణ్యచరితస్య కృపాకరస్య
బ్రహ్మచ్యుతేశ సదృశస్య మునీశ్వరస్య
నిత్యం దయార్ద్రిహృదయస్య పవిత్రమూర్తే
ర్వందే సదైవ జనకస్య పదారవిందం॥

## పితృసేవ

తలిదండ్రులు మొదలగు పెద్దలను సేవించినవాఁడే యోగ్యుఁడును, ధార్మికుఁడు నగు పురుషవర్యుఁడనియు, నిందులకు విపరీతముగా వారిని సేవింపక తిరుగువాఁడు సత్పురుషదృష్టిలో నింద్యుఁడు, గాపురుషుఁడు నగు జనుం డనియు సర్వదేశములలోని సర్వజాతులవారు నంగీకరించి యున్నారు. కాని ప్రస్తుతకాలమునఁ గలిమహారాజుగా రంటట నిచ్చువచ్చి నట్లుపరిపాలించుచున్నారు. ఇత్తటి వితండవాదముతో ధర్మమును రూపుమాపుచున్నారు. ప్రతి మనుష్యునకును స్వాతంత్ర్యి

మును బండితమ్మన్యత్వమును సంభవించినది. ఇప్పటివారు పూజ్యులగు తమ పెద్దవారిని ప్రాతకాలపువారనియు, నజ్ఞానులనియు, ననాగరికు లనియుఁ దలఁపఁ దొడంగిరి. ఇట్టి దారుణ సమయమందును దలిదండ్రులు లోనగు తమపెద్దవారిని త్రికరణ శుద్ధిగా సేవించెడి పురుషులును దక్కువగా లేరు.

మనము మహమ్మదీయ ప్రజపై దృష్టివేసినయెడల నందు వందలకొలఁది కాదు కాదు వేలకొలఁది మఱియు లక్షల కొలఁదిఁ దమ పితరులను నిష్కల్మషులై సేవించెడి యథార్థ భక్తులు గలరని కనుఁగొనఁగలము. మహమ్మదీయులయందుఁ బితృభక్తులు గన్పడినట్లే పార్సీ జాతియందును బూర్ణముగాఁ
ఇట్లే క్రైస్తవజాతియందును మిక్కుటముగాఁ బితృ
గన్పడుదురు. ఎయ్యది పితృసేవ వ్యర్థమని తలంచునో
ము? ఎవఁడు పితృసేవ యనినంతనే కంటగించు
వాఁడెట్టి కొడుకు? సర్వదేశములలోని సమస్త
సంతానము తమ పూర్వపురుషులను సేవించుటయే
తలంచి యందాసక్తి గలవారైనట్లే హిందూ
నిట్టి యథార్థ పితృభక్తి గల సంతతి యతిశయ

పితృసేవకులు గలరా?

"...భవ పితృదేవోభవ"
దేవునిగా నెంచుమని
ఇట్టి వేద మర్యాదను

జూపుటకై నిరాకారుండును, నిర్వికారుండును, సర్వాధారుం డును, సర్వాంతర్యామియు నగు బ్రహ్మ, రాఘవరామచంద్ర రూపమును ధరించి యీ "మాతృదేవోభవ! పితృదేవోభవ! యనెడి వేదమంత్రము లాదలి మర్యాదను దాను చేసి ప్రపంచ మునకుఁగూడఁ జూపెను. ఈ శ్రీరామచంద్రమూర్తి తండ్రి యాజ్ఞను శిరసావహించి వనమునకుఁ జనెడి సమయమునందు దన్ను వెంటనంటి వచ్చెడి యయోధ్యా పట్టణవాసులను వెనుకకుఁ బంపించుటకై యీరీతిగాఁ దన దివ్యముఖమున నుపదేశించెను.

శ్లో॥ అస్పృష్ట యో యశ్చ భయే వ్వరక్షు,
ద్యస్సర్వదాస్మా న పుష త్స్వపోషం।
మహోపకారస్య కిమ స్తి తస్య.
తుచ్ఛేన యానేన వనస్య మోక్షు॥
విద్యుత్ప్రిణాశం స వరం ప్రనష్టో,
యదోర్ధ్వ క్షేమం తృణవద్విశుష్కః।
అర్థే దురాపే కిముత ప్రవాసే,
నశాసనే వా స్థితయో గురూణాం॥

ఏతండ్రి నన్నుఁ బుట్టించి యగ్నిసర్పాదులవలనఁ దప్పించి రక్షించి పెట్టుపోతలఁ బోషించియుండెనో యా మహోపకారి యగు నాతండ్రి యాజ్ఞం దలఁ దాల్చి నే నడవికిఁ జనినయెడలఁ బితౄణమునుండి విముక్తుఁడ నైతినా యేమి? ఇది కేవలము వనవాస మొనర్చుటకే యైయున్నది. ఇంకను బ్రపంచమందు మిగుల కష్టసాధ్యమైన యేపనినో జనకుఁ డాజ్ఞాపించిన యెడల

వచ్చానిని నెరవేర్చని కుమారునకుఁ బైనుండి మెండుగా నెండిన గడ్డిపోచవలెగాని మెఱపు మెఱసి మరుగుపడిన కరణినిగాని సరగున మరణించుటయే యుత్తమము. జగమునందుఁ బిత యొక్క యానతిఁ దాటిన సూనుఁ డెట్టి యెట్టి యనర్థములఁ గలిగించుచుండునో యెవరి కెఱుక!

దీనింబట్టి హిందువులలోఁ బితృసేవావిషయమున వేదాజ్ఞ గలదనియు, శ్రీరామచంద్రపరమాత్మ యద్దానిని నాచరించి ప్రపంచమునకుఁ నుపదేశించి యున్నాఁ డనియుఁ దెలిసికొంటిమి. ఇంక నిట్టివారు గలరు. ఇట్లే విజాతీయులందుఁ గూడ జాలమంది గలరు. కాని యీ ధర్మమునకు లోటును గలిగించునది యేదియు గానరాదు.

పితరులను స్మరించుట యెందులకు?

ఇంతమాత్రమే కాదు. తలిదండ్రులు మున్నగు పెద్ద లీలోకమును విడిచి పోయినప్పుడు గూడ యోగ్యులగు కొడు కుల యంతఃకరణములందు బితరుల యందలి భక్తిప్రవాహా తరంగములు వారు బ్రతికియున్న కాలమందు వలెనే కలుగు చుండును. ప్రపంచమందలి సమస్త దేశములలోని సర్వజాతుల వారును దమ తమ పితరులను స్మరించుట కొఱకు గొప్ప గొప్ప కార్యములను గావించుచున్నారు. కొందఱు సమాధి (గోరీ) గట్టెదరు. కొందఱు మంటపములను నిర్మింతురు. కొందఱు మృతులగు పితరుల ఛాయాపటమును (ఫోటో) దమ నడుము

నకుఁ దగిలింతురు. మఱికొందఱు సుజనులు తండ్రితాతలకు సుఖమును గల్గించుటకై గ్రంథ భాండాగారమును (లైబ్రరీ) తెరతురు. మఱికొందఱు బుద్ధిమంతులు పాఠశాలలను (స్కూళ్ళను) స్థాపింతురు. ఇంక నిట్లే సదావర్తులను (భోజన సామగ్రులను) నొసంగువారును గలరు. వీనివలనఁ గలుగు పుణ్యమేమాత్రమైనను నది తమ పితరులకుఁ జెందవలయునని నా కోరికయైయున్నదని గ్రహింపవలయు.

శ్రాద్ధమనఁగానేమి ?

పై విధమునఁగాక మఱికొందఱు నా సోదరులు తమ ధర్మమునుబట్టియు దేశాచారములనుబట్టియుఁ దమ పితరుల గోరీలమీఁద ఫలములు, బత్తాసులు, మున్నగువానిని బెట్టెదరు. వీనివలనఁ గలుగు పుణ్య మీ గోరీలు గల పితరులకు సంక్రమించుకాక యని వారి కోరికయై యున్నది. తురుష్కులగు మన సోదరు లనేకులు గూడ మరణించిన తమ పెద్దలకు తీజా, దశార్వా, చాలీసా, మఱియు పీరుసాహేబు యొక్క పదునొకండవ దినమును, అమీరహామజా యొక్క శబరాత్, సబీల్, ఉర్సు, లను జేసెడివారును గలరు. వైదిక పద్ధతి ననుసరించి మృతులగు పితరుల సుఖము కొఱకుఁ జేసెడి కర్మము శ్రాద్ధమనియు, పితృయజ్ఞ మనియు వేదమందుఁ జెప్పఁబడెను. భూమండలమునం దుండెడి సమస్త జాతులవారును తమ పితరులకు సుఖమును గలించుట కొఱకుఁ దమ దేశ ధర్మముల కనుకూలమగు పద్ధతిని గొలఁదిగానో గొప్పగానో సత్కార్యములను జేయుచున్నప్పు డీ శ్రాద్ధముపై శంక లెందుకో?

## శ్రాద్ధవిరోధులు గలరా ?

సమస్త జాతులవారును మృతులగు పితరుల శ్రాద్ధ మొప్పుకొను చున్నారు. కాని యార్య సామాజికులు మాత్రము బ్రతికియున్న పెద్దలకే శ్రాద్ధ మంగీకరించుచున్నారు. మరణించిన వారికి శ్రాద్ధములు పనికిరావని యందురు. ఎందుల కట్లు వారందురని యందురా ? అందఱికి విరుద్ధమగు పద్ధతిని నడుచుటలోఁ గూడఁ బ్రతిష్ఠ గల్గుచున్నది గదా ! ఒకనాఁడొక యార్య సామాజికుఁడు నాతో 'పండితవర్యా ! శ్రాద్ధము బ్రతికియున్న పితరులకే చేయుఁడని చెప్పెను. అంత నేను చాల మంచిమాట. అట్లే నేను జీవత్పితకే శ్రాద్ధము పెట్టెదను. నీవు చచ్చిన పెద్దలకు వివాహము చేయుమని చెప్పితిని. పిదప నతఁడు మృతులకు వివాహము సంభవింపదుగదా యనెను. నేనును జీవత్పితకు శ్రాద్ధము సంభవింపదని జెప్పితిని.

## శ్రాద్ధమను శబ్దమున కర్థ మేమి ?

శ్రాద్ధము బ్రతికియున్నవారికా? చచ్చినవారికా ? యను విషయమును నిర్ణయించుకొనుటకు వేదశాస్త్ర ప్రమాణములను గాని, దయానందస్వామి గ్రంథములను గాని యొకరిరువు రార్య సామాజికులచేఁ బ్రయాగ క్షేత్రమందు రచింపఁబడి రెండవ తూరి ముద్రింపఁబడిన సత్యార్థప్రకాశమును గాని చూడవలసిన యవసరము లేదు. శ్రాద్ధ శబ్దము యొక్క యర్థమునుబట్టియే యీ విషయము నిర్ణయము గాఁగలదు. శ్రాద్ధమనెడి శబ్దమున కర్థ మేమనఁగా గతించినట్టి పితరుల నుద్దేశించి తాము భక్షిం

చెడి పదార్థములను శ్రద్ధాపూర్వకముగా నిడెడిదానికే శ్రాద్ధ మని నామము. ఈ శ్రాద్ధార్థము వలన నార్య సామాజికులు దబ్బిబ్బయి యొక నూతనార్థమును సృజించి పడవేసిరి. అదేదన: శ్రద్ధయా యత్క్రియతే తచ్ఛ్రాద్ధం॥ శ్రద్ధతో నేది చేయబడు చున్నదో యది శ్రాద్ధ మనఁబడును. వీరు మనకు బోధ యగుటకై చక్కఁగా వక్కాణించిరి. కాని యీ లక్షణమందతి వ్యాప్తి దోష మపారముగాఁ గలిగినది. ఇందుల కొక యుదాహరణ మిచ్చెద.

ఒక బాబాజీ గలఁడు. అతఁ డొక గుడికిఁ బూజారి. అతఁ డా గుడియందుఁ గొంతమంది విద్యార్థులకు సంస్కృతము గూడ నేర్పుచుండెను. ఒకనాఁ డా దేవున కొక పర్వోత్సవము సంభవించెను. అప్పుడా పూజారి "యీ దినమున నాకుఁ జాల పనులు గలవు. కావుననీవు నా గోవును బొలమునుండి తీసికొని రమ్ము. పొలమునుండి పశువు దిరిగివచ్చునప్పుడు నేను వెంట నంటియుందును. అట్లు వెంట నంటి నే నుండనియెడల నా గోవు పైరులలోఁ బడి పోవుచుండును. అత్తఱి సేద్యగాండ్రు నా యింటిపైఁ బడి మొత్తుకొందురు. అల్లరి చేతురు. అందువలన నీ వా గోవును వెంటనంటి తోలుకొని రమ్ము" అని యొక పెద్ద విద్యార్థికి జెప్పెను. ఆ బడిపెద్దయు విని గురువర్యా: ఎట్టిదానికి గోవు'అని చెప్పెదరు' అని యడిగెను. అందుల కతఁ డోరీ మూర్ఖా! నీవో వ్యాకరణము గూడఁ జదువుచుంటివిగదా! గోవన్నఁ దెలియదా ?వాహ్వా! కృదంతములు గూడ జదివితివే ! నీ కీ గచ్ఛతీతిగౌః॥ గమనము (నడుచుట) చేయునది గోవని

యనఁబడును. అనునదిగూడఁ దెలియదా? యని యనెను. విద్యార్థియు గ్రహించితి గ్రహించితి ననుచు వెలుపలకు వచ్చి మార్గమందు నడిచెడి యొక చర్మకారుని బాలకునిఁ బట్టుకొని గురుమందిరము కడకు వచ్చి ఇదుగో మీ గోవు వచ్చినదని పిలిచెను. గురువుగారును త్రాడు గైకొని వచ్చి యట గోవు లేమిం జేసి గో వెచట నున్నదని యడిగెను. విద్యార్థి యా పంచమ బాలకుని నడుమున గ్రుద్దొకటి గ్రుద్ది ఎట ననెదరేమి? ఇదిగో! యిటనే యున్నదని చూపి పలికెను. అంత నా బాబాజి క్రుద్ధుఁడై అరే యిది గోవురా! యని యడిగెను. అందులకా విద్యార్థి యిదంతయు నాకుఁ దెలియదు. కాని తమ గో లక్షణ మిందు ఘటించినదా? లేదా? అది బాటయందు నడచి పోవుచుండుటఁ జూచి తీసికొని వచ్చితినని ప్రత్యుత్తర మొసంగెను. బాబాజియు విని అరే నీవు పరమ మూర్ఖుడవుగానే యున్నావే; గోవునకు నాల్గు కాళ్ళుండునని మాత్రము చెప్పి చేతిలోని త్రాడును వంకెకుఁ దగిలించి తన పని కొఱకు మరలి పోయెను. విద్యార్థియుఁ దిరిగి గోవును దీసికొని రాఁబోయెను. అతఁడు వెలుపలకుఁ బోయినప్పుడు నాలుగుకాళ్లు గల యొక జంతువును జిక్కించుకొనెను. మఱియు నతఁ డద్దానిని గైకొని గురుని యింటి దొడ్డికడకు సరాసరి వచ్చి నిలిచి రండి! గోవును గట్టివేయండి అని బాబాజీని బిలిచెను. గురుఁ డాతని కేకను విని ఓరీ శిష్యా నేను కార్యాంతర నిమగ్నుఁడనై యున్నాను. త్రాడు వంకెపై నున్నది. నీవే దానిని గట్టివేయుమని యనెను. అంత శిష్యుండును త్రాడు గైకొని యత్నించి అయ్యా యిది

కట్టనిచ్చుట లేదు. వెనుకటి కాళ్ళతో మూతిపండ్లు విరుగదన్ను చున్నది. అయ్యో, అయ్యయ్యో అని మొత్తుకొనెను. అంత బాబాజి గడిబిడి పడి అరే యదెట్టి గోవురా నిన్ను దన్నుచున్న దేమి యని పలుకుచు గబగబ వెలుపలకుఁ జనుదెంచి గాడిదను గని కినుకతో బాగుగాఁ జదివినావు. గాడిదెకును గోవునకును భేదమే కనుపడలేదా? యని యడిగెను. అందులకు విద్యార్థి 'ఆర్యవర్యా! తమ లక్షణమును స్మరించుకొనుఁడు. నాలుగు కాళ్ళు సరిగాఁ గలవు. మూడుగాని యైదు గాని లేవే కనులఁ దెరచి చూడుఁడని ప్రత్యుత్తర మిచ్చెను. ఈ మాట విని బాబాజి తెలివి దెచ్చుకొని అబ్బాయీ, నీదోస మేమియు లేదు. నా లక్షణమే తప్పు. అది తప్పుగా నున్నందువలననే నీకు నాకు నింత కష్టపడవలసి వచ్చినది. ఇఁక నేనిప్పుడు నీకు సరియైన లక్షణము జెప్పెదను. వినుము. ఇద్దానియం దతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవము లనెడి దోషము లేవిధముగాఁగూడఁ బట్టవు. అదేదన: సాస్నామత్వం గోత్వం' దేని మెడక్రింద త్రోలు వ్రేలాడుచుండునో యద్దానికి గోవని పేరు. అనఁగా గంగడోలు గలది గోవు. ఇద్దానిని విని విద్యార్థియుఁ గిలకిల నవ్వి అబ్బా యిప్పటికి నే నతికష్టముగా యథార్థ గోలక్షణమును వినియుంటిని. ఇఁక గోవును దీసికొని రాఁగలను. తమ యీ లక్షణమునం దెట్టి దోషము లేదని చెప్పితిరిగదా యని యను మతి గైకొని తిరిగి పొలమున కరిగి గోవును దీసికొనివచ్చి బాబాజీ కొప్పగించెను.

కంటిరిగదా! బాబాజీయొక్క "గచ్ఛతీతిగౌః" అను లక్షణ మెట్లు అతివ్యాప్తి దోషముచే నావరింపఁబడినదో ఈ లక్షణము చేత గోవు, లొటిపిట మేక, గొఱ్ఱె, గాడిద, మనుష్యుఁడు ధూమశకటము (రైలు) మున్నగున వన్నియు గోసంజ్ఞకుఁ జేరఁగలవు. ఆ రీతిగానే "శ్రద్ధయా యత్క్రియ తేతచ్ఛ్రాద్ధం" ఈ లక్షణము సైత మతివ్యాప్తి దోషముచే దూషితమైనది. ఏయే పనులు శ్రద్ధతోఁ జేయఁబడు చున్నవో యవన్నియు శ్రాద్ధము లగును. ఇద్దానివలన వివాహము, గర్భాధానము, సభ, కాంగ్రెసు, కొలువు, వ్రాయుట, చదువుట, చెప్పుట, ముద్రించుట, లోనగునవన్నియు శ్రాద్ధములై పోయినవి. వాహ్వా! మంచి లక్షణము జేసితివి. ప్రపంచమందలి సర్వ కార్యములును శ్రాద్ధము లైనవి. సంశయింపఁ బని లేదుగదా! ఇప్పు డిందులకుఁగూడ నొక యుదాహరణ మిచ్చెద. విచారించు కొనుఁడు.

గౌరీశంకరుఁడను నొకని కుమారునకు వివాహ మగు చున్నదని యనుకొనుఁడు. ఈ మహోత్సవమునకు గొప్పగొప్ప భూస్వాములు, మహామహులు, శ్రీమంతులు మున్నగువారు వచ్చిరి. కృపాశంకరుఁడు శ్రద్ధతో వచ్చినవారికెల్ల విడుదలఁ నమర్చుటయు, విందులఁ జేయుటయు విహరించుటకు వీలు గల్పించుటయు లోనగు పనులఁ జేయుచుండెను. ఇట్టి తరుణమున నూతనపక్షము (న్యూపార్టీ) నకుఁ జేరిన యొక సజ్జనుఁడరుదెంచి 'కృపాశంకరుఁడుగారూ! ఆహా! యీ దినమం దతి

ధులను చక్కఁగా సత్కరించుచున్నారు. మీ శ్రద్ధ యెక్కువగాఁ గొనియాడఁదగి యున్నది. ఏమి! మీ కొమరుని శ్రాద్ధమా! యని యడిగెను. ఇంతియే. ఇఁక నేమి చెప్పఁగలను! ఈ సమయమునఁ గృపాశంకరుని ప్రాణములు నీరయిపోయినవి. ఇతఁ డతని మాట కడ్డముఁ జెప్పఁజాలక యిట్టి గొప్ప శుభ సమయమందు నింతటి కఠిన భాషణమా! యని గొణుగుకొనుచు నరుగుచుండెను. కాని యేమి సేయఁ గలఁడు ? పాపము ! అతఁ డసమర్థుఁడై యేమియు ననఁజాలక సామాజికుల లక్షణము నందుఁ జిక్కి దెబ్బ దిననివాఁ డుండునా ? ఉండఁడు ఉండఁడు, అని యనుకొని మిన్నకుండెను. ఇది యిట్లుండనిండు. ఇప్పుడు మఱియొకచోట జరుగు సంగతి గూడఁ గొంచె మాలోచింపుఁడు. ఒక ప్రదేశమున నున్న యొక సభకుఁ గార్యదర్శి యగు నొక యోగ్యుఁడు సభ కరుదెంచెడి మనుష్యులను వెంట నిడుకొని వచ్చి శ్రద్ధతోఁ దగిన యాసనములందుఁ గూరుచుండఁబెట్టుచుండెను, ఇట్టి పట్టున నిచటికిఁగూడ నొక యభినవ నాగరికుండగుయువకుం డరుదెంచి మంత్రిగారూ, నేఁడు తమరు మిక్కిలి శ్రద్ధతో వచ్చినమనుష్యులను నాసీనులగాఁ జేయుచున్నారు. మీశ్రద్ధయత్యంత స్తవనీయము. ఏమీ! యీనాఁడుమీనాయన గారి శ్రాద్ధమా? యని యడిగెను, ఈ మాట వినిన వెంటనే సభా కార్యదర్శి కను లెఱ్ఱని నిప్పులవలె మండుచుండ నేఁడితనికి హింగ్వష్టక చూర్ణమునకువలె దశ పట్టించి తీరెదనని నిశ్చయించుకొనెను, అంత నా యువకుఁడు తన్ను జావఁగొట్టెడి కార్యదర్శి గారి ప్రయత్నము నెట్లో కనిపెట్టి వెంటనే బ్రతుకుము జీవుఁడా!

యని యటనుండి కాలికి బుద్ధిచెప్పి యెచటకో చేరి తన చెవిఁ బట్టుకొని యిది సుత నిఁక ము దార్యసామాజికుల లక్షణచర్చ నెంతమాత్ర మెచ్చట గూడఁ జేయనని బుద్ధి చెప్పుకొని చెంపల వాయించుకొనెను. ఇప్పుడు విచారశీలురగు వారీ లక్షణము దెంత యతివ్యాప్తి దోష మున్నదో గ్రహించి యుందురు. ఇట్లు తెలిసికొనియు నది సత్యమని యెట్లు భావింపఁ గలరు? వీరి లక్షణము దోష దూషితమైనందువలననే ప్రమాణముగాఁ దీసికొనుటకు యోగ్యము గాదు. ఇందువలన మరణించిన పిత రుల నుద్దేశించి, యే భోజ్యపదార్థములు పెట్టఁబడుచున్నవో యద్దానికి శ్రాద్ధమని నేను చూపిన లక్షణము బాగుగా సరి పోవును. ఇం దతివ్యాప్తి లేదు. అవ్యాప్తి లేదు. అసంభవ దోషము గూడ లేదు. ఈ లక్షణము దోషశూన్యము శాస్త్ర మాన్యము నై యున్నది. ఇద్దానిఁగూర్చి శాట్యాయనము నిరచిత మగు శ్రాద్ధకల్పము దిట్లున్నది:

శ్లో॥ ప్రేతాన్పితౄంశ్చ నిర్దిశ్య, భోజ్యం యత్ప్రియమాత్మనః
శ్రద్ధయాదీయతే యత్ర, తచ్ఛ్రాద్ధం పరికీర్తితం॥

మృతులగు పితరుల నుద్దేశించి తమ కిష్టమైన యన్నము మున్నగు వానిని శ్రద్ధతోఁ బెట్టి చేసెడి కృత్యమునకు శ్రాద్ధ మని పేరు.

ఇప్పుడు శ్రద్ధతోఁ జేసెడిదానికే శ్రాద్ధమందురా? లేక మృతులగు పితరుల నుద్దేశించి భక్ష్యపదార్థములను బెట్టెడి కార్యము శ్రాద్ధ మందురా? యనెడి విషయము పూర్తిగాఁ

బాలకులకుఁ దెలిసి యుండవచ్చును. అట్లు తెలిసి యున్నప్పుడు శ్రాద్ధము జీవత్పితకా? మృతపితకా? యను విషయమును దీర్మానించుటకొఱకే శ్రాద్ధశబ్దార్థము మాత్రమే చాలునని వచించుచున్నాను.

బ్రతికి యున్నవారికి శ్రాద్ధతర్పణము లేల చేయరాదు?

బ్రతికియున్న పితరులకు శ్రాద్ధతర్పణము లొనర్పవలయు నని తలఁచిన యెడలఁ బరిహారము లేని యనేక దోషములు సంభవించును. పరిహారము లేని కారణము వలన నార్యసామాజికు లధోదృష్టి (నేలచూపు) గలవారును నాస్తికులును గావలసి వచ్చును. ఈ విషయమిటనుండి విస్తరింపబడును.

స్వాములవారితో కుత్రులు

బ్రతికినవారికి శ్రాద్ధతర్పణము లని చెప్పెడి యార్య సామాజికుల నిట్లు ప్రశ్నించుచున్నాను. సత్యార్థ ప్రకాశము యొక్క మొదటికూర్పునందు శ్రీ దయానందస్వామి మృతులగు పితరుల గుఱించి శ్రాద్ధము వ్రాసి యుండెను. అతఁడు స్వర్గవాసి యైన పిమ్మట మీరు బ్రతికియున్న పితరులకు శ్రాద్ధమని యెట్లు వ్రాసితిరి. సత్యార్థ ప్రకాశములోని వ్రాతలను రూపుమాపి మృతపితృశ్రాద్ధముల పట్టున బ్రతికియున్న పితరుల శ్రాద్ధము వ్రాయవలయు ననియు దయానందస్వామిగారి సిద్ధాంతముల నెగురఁగొట్టి యందులకు విపరీతముగాఁ గ్రొత్త సిద్ధాంతముల రచింపవలయు ననెడి స్వత్వాధికారము (పూర్ణపుహక్కు) మీకుఁ గలదా? ఇట్లు చేయుట యార్యసామాజికుల ధార్మి

కత్వము నందుఁ గలిగించుటయే యైయున్నది. ఇందులకుఁ గొందఱ ఆర్యసామాజికులు దయానందస్వామి మాత్రము బ్రతికి యున్న పితరులకే శ్రాద్ధము వ్రాసియుండెను. కాని కూర్పరి (కంపోజిటర్) పొరపాటుచే సత్యార్థ ప్రకాశము మొదటికూర్పు నందట్లు మృతపితృ శ్రాద్ధము ముద్రింపఁబడెనని సమాధానము నిచ్చెదరు. ఇట్లు చెప్పుట బుద్ధిపూర్వకముగా దయానందుని లేఖాజ్ఞాన మపహరించుట యగును. ముద్రాశాలా కార్యములు (ప్రింటింగ్ వర్క్సు) దెలిసినవారికిఁ గూర్పరి (కంపోజిటర్) కూర్పు (కంపోజు) నం దేయొకటి రెండక్షరములోఁ దప్పిపోవుట గలదు గాని రెండు మూఁడు పుటలకంటె నెక్కువగాఁ దప్పి పోవుట సంభవింప దనెడి సంగతి బాగుగాఁ దెలియును. దయా నందస్వామి మృతులగు పితరుల శ్రాద్ధమును సమర్థించుచు మిక్కిలి విస్తారమైన వ్రాతను వ్రాసెను. ఇది యా స్వామిది గాకపోయిన యెడలఁ గూర్పరియే వ్రాసియుండవలెగదా. సరే. ఆర్యసమాజ మిట్లు నాస్తికసమాజముగా నేర్పడి యుండుట సంభవించినప్పు డింకొక దినమున సత్యార్థప్రకాశ మంతయును గూర్పరులే (కంపోజిటరులు) కూర్చిరని చెప్పవచ్చును. కూర్పరు లక్షరముల మాత్రము గూర్చెదరు. తమ యింటినుండి లేఖలను లిఖించి తీసికొనిరారు. మఱియుఁ గూర్పరులకు లేఖల వ్రాయఁ దగినంత తెలివియు నుండదు. వీరు విద్వాంసులు గారు. వీరు సాధారణముగా వ్రాయఁ జదువ నేర్చియుందురు. ఇట్లున్నప్పు డింత గొప్ప లేఖను గూర్పరులు తమ యింటినుండి వ్రాసి తెచ్చి సత్యార్థప్రకాశములోఁ గలిపివేసిరని యెట్లు నమ్మఁగలము? కొంత

సేపు దుర్జనతోష న్యాయమునుబట్టి సత్యార్థ ప్రకాశమునందు
మృతకశ్రాద్ధము దయానందస్వామి వ్రాయలేదనియుఁ దీనిని
గూర్పరులే తమ గృహమునుండి వ్రాసి తెచ్చి యందుఁ గల్పి
వేసిరనియు నంగీకరింతము. ఈ రీతిగాఁ గల్పినప్పుడు చిత్తు కాగిత
ములను (ప్రూఫులు) దిద్దెడి సమయమునందు దయానందస్వామి
కూర్పరుల యీ పై లేఖను దీసివేయ లే దెందులకు? సత్యార్థ
ప్రకాశము యొక్క మొదటికూర్పు చిత్తును దయానందస్వామి
స్వయముగా దిద్దెనుగదా. ఈ విషయమును బండిత తులసీరాం
స్వామి, భాస్కరప్రకాశము యొక్క భూమికయందు వ్రాసి
యున్నారు. చిత్తును శోధించిన సమయమునందుఁగూడ దయా
నందు లిద్దానిని దీసివేయలేదు. మఱియు సత్యార్థప్రకాశము
ముద్రింపబడి సిద్ధమైనతరువాత దీనికి శుద్ధాశుద్ధ పత్రమును దయా
నందులు రచించివేసిరి. వీరి యీ తప్పొప్పుల పట్టియం దీ లేఖా
విషయ మేల చేర్పఁబడలేదు? ఎట్లు యావత్తు వ్రాతధోరణి,
సత్యార్థప్రకాశ గ్రంథము దైనదో యట్లే మృతకశ్రాద్ధమునకు
సంబంధించిన పై లేఖయు నైయున్నది. కూర్పరి యున్నదున్నట్లు
దయానందస్వామి వ్రాతల ధోరణినిగూడఁ (ఒకదానిని జూచి
వ్రాసెడి వ్రాత) నకలు చేసి వేసికొనఁగలఁడా యేమి? యథా
ర్థము విచారించినచో దయానందస్వామి మృతులగు పితరుల
శ్రాద్ధమును సత్యార్థప్రకాశము యొక్క ప్రథమ ముద్రణము
నందు ముద్రింపించి యుండెననియు, నతఁడు మృతిజెందిన పిమ్మట
నాతని మర్యాదను సిద్ధాంతమును నెంతమాత్రముగూడ లక్ష్యము
చేయక యీ యార్యసామాజికులే బ్రతికియున్న పితరుల శ్రాద్ధ

మును ముద్రింపించిరనియు, నిప్పుడు మొదటిది కూర్పరి పొరపా టని యతనిపై దోష మారోపించుటకుఁ బూనిరనియు స్పష్ట మగుచున్నది. కాని వారు కూర్పరిపై నట్లు దోష మారో పించుట యసత్యములలోనికెల్ల నసత్యము. అందు వారు సఫల మనోరథులు గారు. శాస్త్రార్థమం దోడిపోయి తలవంచి తీరుదురు.

## మృతకతర్పణము లేదా?

ఉన్నది. మున్షీ . నవలకిశోరుగారు దయానందస్వామిచే రచింపఁబడిన పంచమహాయజ్ఞవిధి యను పొత్తమును ముద్రిం పించి యున్నారు. ఆ గ్రంథమం దిప్పటికిని మృతులగు పితరుల తర్పణము వ్రాయఁబడి యున్నది. దీని కార్యసామాజికు లేమి ప్రత్యుత్తర మిచ్చెదరు? వీరు ప్రస్తుతమందు ముద్రించిన సంస్కార విధిలో సమావర్తన ప్రకరణమందు దక్షిణదిక్కున కెదురుగా ముఖముంచి యపసవ్యము జేసికొని మోకాలు భూమిమీఁదఁ బెట్టి పుడిసిలిలో జలము పోసికొని 'ఓం పితరశ్శుంధధ్వం' అని యీ మంత్రమును బఠించి యా యుదకమును నేలపై విడిచి పెట్టుమని వ్రాయఁబడి యున్నది. ఈ తర్పణము బ్రతికియున్న పితరులకా? చచ్చిన పితరులకా? వ్రాయఁబడినదని యా సామా జికుల నడుగుచున్నాను. బ్రతికియున్నవారికే యైన యెడల మోకాలు భూమిపై మోపుటకును, నపసవ్యమును జేసికొనుట కును నేమి పని యున్నది? ఈ సామాజికులు తమ బ్రతికియున్న పితరుల కపసవ్య మొనర్చుకొని జలమును ద్రాగించెదరా? యేమి?

మఱియు వీరి జీవించియున్న పితరుల పొట్ట యొక్క పుడిసిలి నీటి తోడనే నిండిపోవునా? యేమి? దక్షిణాభిముఖ మెందులకు? వీరి పితరులు దక్షిణ దిక్కునందలి హైదరాబాదు నవాబుకడఁ గొలువు జేయుటకుఁ బోయిరా? అందుల కేనా దక్షిణాభిముఖము జేయవలసినది? ఈ తర్పణము బ్రతికియున్న పితరుల కైనప్పుడా యొక్క పుడిసిలి జలము నే బ్రతికిన పితనోటనో వోయక, నేలపైఁ బారఁబోయుట యెందులకు? తర్పణ మొనరించెడివారి బ్రతికియున్న పితరులు భూమిలోపల దూరియుండి తర్పణజలమును గటగట ద్రాగెదరా? యేమి? బలేబాగున్నది!

## పితృ మృత్యువు

నెల కొకసారి అమావాస్యనాఁడు శ్రాద్ధ మొనర్పవలసినదని వేదమం దిట్లు చెప్పఁబడినది.

"సోదక్రామత్సా పితౄనాగచ్ఛత్, తాంపితరోఘ్నత సామాంసి సమభవత్, తస్మాత్పితృభ్యోమాస్యుపమాస్యం దదతి, ప్రపితృయాణం పంథాంజానాతియ ఏవం వేద"

అధర్వ ౮॥౧౦॥౩॥౮॥

ఆ విరాట్పురుషుని శక్తి పైకిఁబోయి పితరులలోఁ బ్రవేశించెను. పితరు లద్దానిని బంపిరి. అది మాసమునందుఁ బ్రవిష్టమయ్యెను. దీనింబట్టి పితరులకు మాసమాసమందు శ్రాద్ధభోజన మిచ్చెదరు. ఇద్దాని రహస్య మెరింగినవారు పితృయాణ మార్గమును గూడఁ దెలిసికొనఁగలరు. మను విట్లు వ్రాయుచున్నాఁడు.

శ్లో॥ పితృయజ్ఞంతు నిర్వర్త్య, విప్రశ్చేందుక్షయేఽగ్నిమాన్
పిండాన్వాహార్యకం శ్రాద్ధం, కుర్యాన్మాసానుమాసికం॥
మ॥ ౩అ॥ ౧౨౨॥శ్లో॥

పిండమును బితృయజ్ఞమును నిర్వర్తించి యమావాస్యా దినమునం దగ్నిహోత్రి యగు బ్రాహ్మణుఁడు పిండాన్వాహార్యక మనెడు శ్రాద్ధమునందుఁ బ్రతిమాసమునందుఁ జేయవలెను.

ఆర్యసామాజికులు తమ బ్రతికిన పితరుల శ్రాద్ధ మమావాస్యనాఁడే చేతురా? యేమి? మిగిలిన గట్టి యిరువది తొమ్మిది దినములు చేయక నిలిపెదరా? శ్రాద్ధ మేమైనది? చచ్చినదా? రెండవ యమావాస్య వచ్చువఱ కెందఱో బ్రతికియున్న పితరులు శరీరమును విడిచి యముని యింటికి త్రోవఁ బట్టుదురు. ఇంతేకాదు. ఎందఱో బ్రతికియున్న పితరులు శరీరముల వదలి యమావాస్యనాటికిఁ బదుమూఁడు దినములే యగును. బలే శ్రాద్ధము నేర్పితిరి? గృహములోని పితరులనే విడిచిపెట్టితిరి! దీని కంటె సామాజికులు జీవించియున్న పితరులకు గూడ శ్రాద్ధము మానివేయుట మంచిది. మీరు శ్రాద్ధములను సల్పుట జీవించియున్న పితరులను జంపెడి సామగ్రినే సిద్ధము జేయుచున్నారు. ఇంతవఱకు భరతఖండము గోవధచేతనే క్షోభించుచున్నది. ఇఁక నీ యార్యసామాజికుల యనుగ్రహమునఁ గలిగెడి పితృవధ చేతను గూడ క్షోభింపవలసి యున్నదేమో!

కొందఱు సుజనులు సనాతన ధర్మియులు గూడ మృతులగు పితరులకు మాసమునం దొక దినముననే శ్రాద్ధ భోజన

మిడుచున్నారు. మిగిలిన యిరువది తొమ్మిది దినములు వారిని నుపవసింపఁ జేసి చచ్చిన పితరులను దిరిగి చంపెదరు. దీనివలన రెండు చావులు సంభవించుట లేదాయని యడుగగలరు. ఇందు లకు సమాధాన మిది

మృత పితృ శ్రాద్ధ మాచరించెడివార లీ యమావాస్య కమావాస్యకు శ్రాద్ధము సల్పినప్పటికిని బితరులకు నిత్యభోజన మగుచున్నది. ఇందువలనఁ బితరు లాకలిగొని చచ్చిపోరు. దీనిం గూర్చి మనువిట్లు చెప్పుచున్నాడు

శ్లో॥ పిత్ర్యేరాత్ర్యహనీమాసః, ప్రవిభాగస్తు పక్షయోః
కర్మచేష్టా స్వహః కృష్ణః, శుక్లస్స్వప్నాయ శర్వరీ॥

౧అ॥ ౬౬శ్లో॥

పక్షముల విభాగమునుబట్టి పితరులకు రేఁబవళ్లు లగును. కృష్ణపక్షము పితరులకు పగలగును. ఇందుఁ బనులఁ జేసికొం దురు. శుక్లపక్షము పితరులకు రాత్రి యగును. ఇందు నిద్రింతురు

స్పష్టార్థము

సాధారణముగా మనుష్యుల పగలునకుఁ బండ్రెండు గంట లగును. ఇట్లే వీరి రాత్రికిఁగూడఁ బండ్రెండుఘంట లగును. చలికాలములోఁ బగలు కొలఁదిగాను, రేయి గొప్పగాను, ఎండకాలములో రేయి కొలఁదిగాను, పగలు గొప్పగాను నగు చుండును. ఇచట నిట్టి లెక్క గాదు. మొత్తముమీఁది గణనమై యున్నది. సాధారణముగా మనుష్యుల కిరువదినాల్గు ఘంటలు రేంబవళ్లు లెట్లగునో యట్లే పితరుల.కొక మాసము రేఁబవళ్లు

లగును. అనఁగాఁ జంద్రునికంటె నుపరిభాగమందున్న నక్షత్ర ములమీఁద నుండిన పితృలోకములో శుక్లపక్షమునందు సూర్యుని దర్శనము గానేరదు. కనుకనే శుక్లపక్ష మంతయు నచట రాత్రి యగును. ఇందులకు వ్యతిరేకముగా కృష్ణపక్షములోని రాత్రిందివములు పూర్తిగా బదునైదు దినములు సూర్యోదయ మగుచుండును. కాఁబట్టి కృష్ణపక్ష మచటఁ బగలగును. దీనిం గైకొని మనుస్మృతి, కృష్ణపక్షము పితరులకుఁ బగలనియు శుక్లపక్షము రాత్రియనియుఁ జెప్పినది. ఇప్పుడు సనాతన ధర్మీయులమావాస్య నాఁడు శ్రాద్ధ మొనరించిరి. పితృదేవత లరుదెంచి వారిడిన యన్నాదుల సూక్ష్మాంశమును గ్రహించిరి. నేఁడమావాస్య, పితృదినము ముగిసినది. మరునాఁడు శుక్లప్రతిపత్తు. శుక్లపక్షము పితరులకు రాత్రి. శుక్లప్రతిపత్తు మొదలుకొని పూర్ణిమవఱకుఁ బితరులు శయనించిరి. పున్నమ దాఁటినవెంటనే కృష్ణప్రతిపత్తు వచ్చె. ఇది మొదలుకొని పితరులకు దినము (పగలు) ప్రారంభమైనది. ఇప్పుడు పితరులు నిద్దురనుండి మేల్కాంచిరి. అమావాస్యా దినమున వారికి సాయంకాల మగుచున్నది. ఆ దినముననే సనాతన ధర్మీయులు శ్రాద్ధమును బెట్టుదురు. ఈ లెక్కనుబట్టి పితరులకు నిత్యభోజనము సంభవించుచున్నది. కర్మకాండమందును, పరమేశ్వరారాధనమందును బెట్టవలసిన భోజన మేకసమయమునందే యిడవలసినదని వ్రాయబడినది. కనుకనే పితరులకు దివరాత్రుల గణనముబట్టి సాయంకాలమున (అపరాహ్ణమున) నిత్యభోజనము గల్గుచున్నది. ఇఁక వీరెట్లాకలిగొని చావఁగలరు? చావరు.

ఇట్టి ప్రమాణములనుబట్టి శ్రాద్ధము మృతులగు పితరుల కొఱకే యై యున్నదని తేలినది. ఇంత చర్చ జరిగినమీాద గూడ నార్యసామాజిక సోదరులు బ్రతికియున్నవారికే శ్రాద్ధమని వాదించెదరు. అబ్బా! అంతవారా!

వ్యభిచారము సంభవించునా?

ఏమనుష్యునకు సంతానము గలుగదో యతనికి సంతతి గలుగుటకై శ్రాద్ధమును జేయవలసిన దని వ్రాయఁబడి యున్నది. ఈ శ్రాద్ధకార్య మందు మూఁడు పిండములఁ బెట్టె దరు. నడిమి పిండమును భార్య భుజింపవలయును.

"ఆధత్త పితరోగర్భ మితి మధ్యమంపిండం పత్నీ ప్రాశ్నీయాత్" అని గృహ్యసూత్రము చెప్పినది. అనఁగా యాజ్ఞికుఁడు "ఆధత్త పితరోగర్భం" అను మంత్రమును బఠించునప్పుడు శ్రాద్ధము జేసెడివాని భార్య మధ్యమ పిండమును భక్షింపవలసినది. మఱియు మనుస్మృతి మూఁడవ యధ్యాయమున

శ్లో॥ పతివ్రతా ధర్మపత్నీ, పితృపూజనతత్పరా
మధ్యమంతు తతః పిండ, మద్యాత్సమ్యక్సుతార్థినీ॥ ౨౬౨
ఆయుష్మంతం సుతం సూతే, యశో మేధా సమన్వితం
ధనవంతం ప్రజావంతం, సాత్వికం ధార్మికం తథా॥ ౨౬౩

చెప్పియున్నాఁడు. పితృపూజయం దాసక్తి గలదియు, వివాహితయుఁ బతివ్రతయుఁ బుత్రసంతానము గోరునదియు నగు సతి 'ఆధత్త పితరోగర్భం' ఈ మంత్రము బఠించు సమయమందు

మధ్యమ పిండమును భక్షించి యాయుష్మంతుఁడును, యశస్వి, మేధ, ధనము గల వాఁడును, వంశవర్ధనుండును, సాత్వికుండును, ధార్మికుండును నగు కుమారుని గనునని యర్థము.

ఈ శ్రాద్ధమందలి మధ్యమ పిండమును భక్షించెడి తరుణమునఁ బఠించెడి మంత్ర మిట్లున్నది.

'ఆధత్త పితరోగర్భం, కుమారం పుష్కర స్రజం
యథేహపురుషోసత్॥ యజు॥ అ ౨॥ మం 33

ఓ పితరులారా! ఈ ఋతువునందు దేవతలయుఁ మనుష్యులయు బితరులయుఁ గోరికను బూరితిగాఁ దీర్చెడి ధీరుఁడును, బుష్ప మాలను ధరించెడివాఁడును నగు గుణవంతుని బుత్రరూపముగా గర్భమునకు సంపాదింపుఁడు.

దీని యభిప్రాయ మేమనఁగా శ్రాద్ధకర్త శ్రాద్ధమునందుఁదన సతికి గర్భ మగున ట్లనుగ్రహింపవలసినదని పితరులను బైరీతిగాఁ బ్రార్థించును. ఈ ప్రార్థనము మృతులగు పితరులను గూర్చి చేయఁజాలును గాని బ్రతికియున్న పితరులం గూర్చి చేయం జాలఁడు. చేసినచో వ్యభిచారము సంభవించితీరును. ఏమీ! శ్రాద్ధకర్త, బ్రతికియున్న పితరులం గూర్చి, అయ్యలారా! తమ రన్నాదులను భుజించితిరి. కొంచెము శ్రమ చేసి నా భార్యకుఁ గూడ............ యని చెప్పఁగలఁడా? ఒకప్పు డెవఁడేని బ్రతికియున్న పితరుల శ్రాద్ధ మారంభమై భుజించిన పిమ్మట బ్రతికియున్న పితరులతో నిట్టి ప్రార్థనము జేయఁజాలినప్పుడు

సిగ్గునకుఁ దిలాంజలి యిడవలసినదే. ఇట్టి వ్యభిచారము నే జాతియుఁగూడ స్వీకరింపఁ జాలదు. ఆర్యసామాజికుల దృష్టిలో నిదిగూడ దేశోన్నతికి సాధనముగా సంభవింపవచ్చును. శహబాస్ వాహ్వా! ఎట్టి జీవత్పితృశ్రాద్ధమును బయలుదేరఁ దీసిరి: సామాజికు లెంత పాపకార్యమైనను జేయుట కొడిగట్టుదురు గాని జీవత్పితృశ్రాద్ధవిషయకమగు పట్టుదలను విడిచిపెట్టరుగదా!

ప్రమాణము లేదా!

వైదిక వాఙ్మయమునందుఁ బురాణ, న్యాయ, వైశేషిక, మీమాంసా, వేదాంత, ధర్మశాస్త్ర, శిక్షా, కల్ప, చ్ఛందో, వ్యాకరణ, నిరుక్త, జ్యోతిష, ధనుర్వేద, గాంధర్వవేద, స్థాపత్యవేదాయుర్వేదములును, మంత్రబ్రాహ్మణాత్మకములగు ఋగ్యాజుస్సామాథర్వ వేదములును బ్రమాణ గ్రంథములు ఆర్యసామాజికులను 'మీ యీ నవీన మత మనఁగా జీవత్పితృశ్రాద్ధ మే కబ్బమునందు వ్రాయఁబడి యున్నదని యడుగవలెను. వైదిక సాహిత్యములోని యేపుస్తకమునందుఁ గూడ దీనివిషయ ముల్లేఖింపఁ బడనప్పు డీఁక వీరికీ ప్రసంగ మెందులకో తెలియదు. మాకుఁ దెలిసినంతవఱకు వైదిక సాహిత్యములో దీని కెట్టి వ్రాతయు లేదు. ఇట్లే యన్యధర్మగ్రంథములగు కురాను, బైబిలు, జెందావస్థా మున్నగు వానిలో గూడ నెట్టి ప్రమాణము లేదని తలఁచెద. నిరాధారముగా మన యార్యసామాజికులు జీవత్పితృశ్రాద్ధము నెట్లో వెడలించిరి. నీరు మృతకపితృశ్రాద్ధ పీడ విడిపించుకొనుటకై యీ జీవత్పితృశ్రాద్ధమును గల్పించికొని రని తెలియుచున్నది.

## మృతకపితృశ్రాద్ధ నిషేధము లేదా ?

నేటికాలమునందు మన సామాజికులు వేదశాస్త్ర జ్ఞానమును సంపాదింపక ప్రతిదినమందును మృతకపితృశ్రాద్ధమును గలిన ప్రతిజ్ఞతో నవైదికమనియు, వేద విరుద్ధమనియు ఖండించి చెప్పుచుందురు. ఇది వేదవిరుద్ధము, వేదదూష్యము అని చెప్పఁదొడంగి నలుబదిరెండు సంవత్సరములు గడచినవి. కాని శ్రాద్ధ విషయమును గూర్చి జరిగిన శాస్త్రార్థమం దార్యసామాజికు లెట్టితరుణమునందును మృతపితృశ్రాద్ధమును నిషేధించెడి యే వేదమంత్రమునుగూడఁ జూపింపఁజాలకపోయిరి. ఏమీ ! ఏయార్య సామాజికుండైన నెట్టిసమయమం దైనను మృతులగు పితరుల శ్రాద్ధమును నిషేధించెడి యే వేదమంత్రమైనను జూపించినాఁడా? చూపింపఁ జాలనప్పు డిఁక వీరి కథనము వృథయనియే తలంపవలెను.

## జీవత్పితృశ్రాద్ధ మసంభవ మెట్లగును?

సత్యార్థప్రకాశము చతుర్థ సముల్లాసమునందుఁ బుట్టిచివరకు ౨౫ యేండ్లు వయస్సు వచ్చువఱకైనఁ జదువవలసిన దని వ్రాయఁబడినది. ఒక మనుష్యుఁడు ౨౫ సంవత్సరములకుఁ జదివి ౨౬వ యేట వివాహమును జేసికొని యున్నాఁడే...... ............గర్భమును గలిగించి ౯ మాసములకుఁ దరువాత నొక పిల్లవానిని గనెనని యనుకొనుఁడు. ఆకుమారుఁ డెనిమిదవ యేటఁ జదువుటకొఱకే యాచార్యకులమునకో యే గురుకులమునకో యేగి యిరువదియైదేండ్లు నిండువఱకుఁ బఠించి యటనుండి

యింటికేగుదెంచెను. అప్పుడీ కుమారున కిరువదైదు సంవత్స రములును, వీని తండ్రి కేబదియొకటి సంవత్సరములును గలవు. సత్యార్థప్రకాశము ౫౧వ సంవత్సరముయొక్క ప్రారంభము నందే వానప్రస్థాశ్రమమును స్వీకరింపవలసినదని వ్రాయుచున్నది. ఈ పిల్లవాఁడు చదివి గృహమున కేతెంచువఱకు నంతకంటె నొకయేడు ముందుగానే యీ పిల్లవాని తండ్రి వానప్రస్థము గైకొని వనమునకుఁ బోవును. ఇఁక జీవత్పితకేరీతిగా శ్రాద్ధము సంభవము గాఁగలదు? సత్యార్థప్రకాశములోని యధ్యయన పద్ధతివలన జీవత్పితృశ్రాద్ధ మసంభవ మైనప్పుడు తిరిగి యిది వ్రాయుట యెందులకు? ఏమి! జీవత్పితృశ్రాద్ధమును వ్రాసెడి సమయమందు సత్యార్థప్రకాశములోని సంగతిపై ధ్యానముంచ లేదా? ఇంత తప్పా! సమస్త ప్రపంచము మూర్ఖమయ మని మన సోదరులు తలంచిరి. భళీ! భళీ!

## పనికిమాలిన ప్రసంగమేనా?

ఇప్పటి యార్య సామాజికు లందఱు గూడ జీవించి యున్న పితరుల శ్రాద్ధమును ఖండనము జేయుచుందురు వైదికసారస్వతమందలి ప్రమాణము మాత్రము వీరికిఁ జిక్కదు. ఇప్పటికిఁ గూడ నోటిగుల దీరునట్లు మాట్లాడుచునే యుందురు. ఈ ప్రచారము కేవలము వాచాటత్వమునకా? ఆచరించుటకా? యని వీరల నడుగుచున్నాను. ఆచరించుటకే యైనచో జీవించియున్న పితరుల శ్రాద్ధ మొనర్చెడియాతఁ డే యార్య సామాజికుఁ డగును? నాకుఁ దెలిసినంతవఱ కీక్షణమువఱకు

గూడ నిట్లు జీవించియున్నవారికి శ్రాద్ధ మొనర్చెడివాఁ డెవఁడును గోచరింపలేదు. అధర్వవేదములో శ్రాద్ధకర్మమందుఁ బితరుల మొగముపైఁ బచ్చినువ్వులు మున్నగునవి చల్లుటయు, పితరుల నలుప్రక్కలను మండెడి కట్టెను ద్రిప్పుటయు లోనగు క్రియలం జేయవలసిన దని వ్రాయఁబడినది. ఈరీతిగా వ్రాయబడిన క్రియలతోఁ గూడ నే యార్య సామాజికుఁడు బ్రతికియున్న పితరులకు శ్రాద్ధ మొనర్చియున్నవాఁడో యతనిని దయయుంచి వార్తాపత్రికలందుఁ బ్రకటింపఁ జేయుఁడు. దీనిం బట్టి యార్యసామాజికుఁ డెవఁడు గూడ జీవత్పితృశ్రాద్ధమును జేయండని భావము. ఇఁక వీరు జీవత్పితృశ్రాద్ధముకొఱకుఁ బ్రగల్భములఁగొట్టుట యెందుకు? ఏరీతిగా నైన మృతపితృశ్రాద్ధము రూపుమాయవలె ననియు వేదవిధి ధ్వంసము గావలయు ననియు వీరి నోటనుండి బయలువెడలిన దెల్ల వేదము గావలెననియుఁ గృత్రిమ క్రైస్తవులము గావలయు ననియు వీరి మనోరథములైనట్టు తోఁచుచున్నది.

## మృతకశ్రాద్ధము గలదా?

కలదు. మా పాఠకబృందము జీవత్పితృశ్రాద్ధమును గూర్చిన చర్చను జదివినది. ఇఁక నిప్పుడు మృతులగు పితరుల శ్రాద్ధమును గూర్చిన విచారణమును బాఠక సమ్ముఖమ్మునఁ బెట్టెదను. నేను మృతకశ్రాద్ధమును గూర్చిన విచారణమును సంపూర్ణముగా వ్రాసినచో నిది యొక పెద్ద గ్రంథమగును. ఇట్టి గ్రంథవిస్తరభీతిచేతను, వేదమందలి గంభీరత్వమును సామాన్య

జన ముత్సాహముతోఁ జదువుకొననుండకపోవుట చేతను మృత
పితృశ్రాద్ధమును గూర్చి పాఠకుల కెక్కువ పరిశ్రమ గలుగ
కుండునట్లును బాగుగా విషయము దెలియునట్లును వ్రాయఁ
గడంగెద.

శ్రాద్ధమందలి పితరు లెవరు?

వేద మేపితరుల శ్రాద్ధవిధిని లిఖించినదో యా పితరు
లెవరు? ఈ విషయమును విమర్శించుచు నథర్వవేద మిట్లు
నుడువుచున్నది.

"మృతాః పితృషు సంభవంతు"

అథర్వ॥౧౮॥౪

మృతులగు పురుషులే పితృస్వరూపమును నొందుదురు. శ్రాద్ధ
ములో మృతులగు పితరులే గ్రహింపఁ బడిరని స్పష్టమైనది.
కఠశాఖయొక్క కాఠీయశ్రౌతసూత్రమునం దిట్లు వ్రాయబడినది

'పితా ప్రేతః స్యాత్పితామహో జీవేత్ప్రితే పిండం నిధాయ
పితా మహాత్పరాభ్యాం ద్వాభ్యాం దద్యాదితి॥'

తండ్రి చచ్చి తాత బ్రతికియున్న యెడల నాతండ్రికిఁ బిండమును
బెట్టి తాతకుఁ బెట్టక తాతకంటెఁ బైనున్న యిరువురగు పితరుల
పేరఁ బిండములం బెట్టవలసిన దని యర్థము. మరియు

'పితా యస్య నివృత్తస్స్యా, జ్జీవేచ్చాపి పితామహః
పితుస్సనామ సంకీర్త్య, కీర్తయేత్ప్రపితామహం।

మను ॥ అ 3 ॥ ౨౨౧ శ్లో

తండ్రిమరణించి తాత బ్రతికియున్న మనుష్యుడుఁ శ్రాద్ధమందుఁ దండ్రిపేరుగ్రహించి ముత్తాతపేరును బలుకవలసినది. అనఁగాఁబ్రతికియున్న పితామహుని (తాత) కుఁబిండప్రదానము చేయరాదు.

మఱియు, యమస్మృతి

"నిత్యంనైమిత్తికంకామ్యంవృద్ధిశ్రాద్ధ మథాపరం
పార్వణంచేతి విజ్ఞేయం, శ్రాద్ధంపంచవిథంబుధైః॥ ౮౨
గ్రహోపరాగేసంక్రాంతౌ, పర్వోత్సవమహాలయే
నిర్వాపేత్త్రీన్నరఃపిండా, నేకమేవ మృతేహని॥ ౮౩

నిత్యము, నైమిత్తికము, కామ్యము, వృద్ధి శ్రాద్ధము, పార్వణములని శ్రాద్ధమైదు విధములుగానున్నదని విజ్ఞులు గ్రహింపఁదగినది. గ్రహణము, సంక్రాంతి, పర్వము, ఉత్సవము మహాలయము వీనియందు మనుష్యుఁడు మూడుపిండములఁ బెట్టవలసినది. తలిదండ్రుల మృతతిథియందొక పిండము నేయిడ వలయును. ఈ విషయమును గురించి కాత్యాయనస్మృతి యిట్లు చెప్పుచున్నది.

పితామహే జీవతిచ, పితుఃప్రేతస్య నిర్వపేత్
పితుస్స్వస్యచవృత్తస్య, జీవేచ్ఛేత్ప్రపితామహః॥ ౧౩
పితుః పితుః పితుశ్చైవ, తస్యాపిపితురేవచ
కుర్యాత్పిండత్రయం యస్య, సంస్థితః ప్రపితామహః॥ ౧౪

తండ్రి, తాత, ముత్తాతలను వీరికి ముగ్వురకు మూడుపిండములం బెట్టవలెను. తండ్రిచచ్చి తాతబ్రతికియున్నయెడల మరణించిన

తండ్రికిఁ బిండమును బెట్టవలెను. ముత్తాత బ్రతికియుండి తండ్రి తాతలు చచ్చినయెడల వృద్ధప్రపితామహునకు [ముత్తాతయొక్క తండ్రి]ను తాతకును, తండ్రికిని మూడుపిండముల నిడవలయును. బ్రతికియున్నవారిపేరఁ బిండములఁ బెట్టఁగూడదు, యాజ్ఞవల్క్య స్మృతి యిట్లు నుడువుచున్నది.

మృతేహానితుకర్తవ్యం, ప్రతిమాసంతు వత్సరం
ప్రతిసంవత్సరంచైవ, మాఘు ఏకాదశేహని॥"

మనుష్యుఁడు మరణించిన తరువాత మొట్టమొదటి పదు నొకండవ దినమందొక పర్యాయమే యేకాదశాహ [ఏకోద్దిష్ట] శ్రాద్ధమును జేసి యొకసంవత్సరమువఱకుఁ బ్రతిమాసమందును మృతతిధియందు శ్రాద్ధమును బెట్టవలయును. మఱియుఁ బ్రతి సంవత్సరమందును మృతతిధియందేకోద్దిష్టశ్రాద్ధ మొనర్పవలెను. ఇంక నితరస్మృతి ప్రమాణములనేకములు మృతపితృశ్రాద్ధము నే సిద్ధింపఁజేసెడివి గలవు. కాని వాని వ్రాయుట యనవసరమని తలంచి విడిచితి. ఆస్తికుల కొఱకుఁ బైని జూపఁబడిన ప్రమాణ ములే సంతోషదాయకము లగును. ఆర్యసామాజికులను సంతుష్టి పరచుటకై యుద్యోగించుట గూడ వ్యర్థము. వారంత గట్టివారు. అదియుగాక వారు ధర్మశాస్త్రములను నమ్మరు. వేదములను విశ్వసింపరు. సత్యార్థప్రకాశమును లక్ష్యము చేయరు. దయానందస్వామివారి యితరములగు వ్రాతలను గూడ గౌరవింపరు. ఇఁక వీరిని కేవలము నాస్తికులని ప్రత్యేకించి చెప్ప వలెనా? వీరిని బరమేశ్వరుఁడు నిషేధించినప్పటికిని వీరొప్పుకొనరు కానఁ 'దత్ప్రియత్న మనవసరము.

యజుర్వేదమందలి ౧౯వ యధ్యాయమున, నథర్వవేదములోని ౧౮వ కాండయందును, మనుస్మృతిలోని ౩వ యధ్యాయమునందును, శ్రాద్ధవర్ణన మున్నది. ఈ మూడు చోట్లను మృతపితృశ్రాద్ధము గలదు. నేటికాలమందున్న యార్యసామాజికులు వేదమునుండి పిండప్రదానము దొలంగించుటకై పెక్కుగొప్ప పన్నాగములను బన్నుచుందురు. వారిలో గొందఱు వేదములోనుండి జీవన్మాతాపితృశబ్దములను జూపించి వారికే శ్రాద్ధ మొనర్పవలసినదనెడి సంగతిని దమ పక్షమునఁ గల్పించి కూడఁ జెప్పెదరు. వేదమునందు బ్రతికియున్న తలిదండ్రుల శబ్దములు గూడ రావని మా వాదము గాదు. ఇఁకేమన? శ్రాద్ధవర్ణనమం దథర్వవేదము పదునెన్మిదవ కాండయు యజుర్వేదమందలి పందొమ్మిదవ యధ్యాయమును, మృతపితృశ్రాద్ధమునే సిద్ధింపఁ జేయుచున్నదని మాయుద్దేశము. ఇఁక శ్రాద్ధమందలి పితరులయొక్క నివాసస్థానమును జెప్పెదను.

'ఉదన్వతీ ద్యౌరవమా, పీలుమతీతిమధ్యమా-
తృతీయాహప్రద్యౌరితి, యస్యాం పితర ఆసతే॥

అథర్వ॥౧౮॥౨॥౨

ఆకాశమునకు మూడు భాగములు గలవు. భూమి మొదలుకొని జలకణము లెగిరెడివఱకు నున్న యాకాశమునకు 'ఉదన్వతి' యని నామము. అనఁగా జలకణములు గలది. ప్రథమభాగము. దీనిపైన నుండుదానికి 'పీలు' అనెడి పేరు.

ఎందులకనఁగా ఈ భాగములో సూర్యుని కిరణము లెక్కువగాఁ బ్రసరించును. మఱియు జలాదులు లేకపోవుట వలననీ కిరణములు వీలు (పసుపుపచ్చనిరంగు) గలవగుటయే కారణము ఈ రెండవ భాగమునకంటె మీఁద నుండుమూఁడవ భాగమునకు 'ప్రద్యౌ' యనినామము. ఇద్దానియందు నక్షత్రము లెక్కువగా నుండును. ఇందువలన నిది తెల్లగా నుండును. ఈ భాగమునందే పితృ లోకము గలదు. అనఁగాఁ బితరు లాకసముయొక్క పై భాగ మనందు నివసించుచున్నారు. ఈ విషయమును గుఱించి సిద్ధాంతశిరోమణి యనెడి జ్యోతిషగ్రంథ మిట్లు నుడువుచున్నది.

"విధూర్ధ్వభాగేపితరోవసంతి"

చంద్రునికంటెఁ బై భాగమునందుఁ బితరులు నివసింతురు. బృహదారణ్యకోపనిషత్తులో నీవిషయము వచింపఁబడినది.

"యేశతం మనుష్యాణామానందాః సఏకః
పితౄణాం జితలోకలోకానామానందః॥"

బృ॥౪॥3॥33

మనుష్యుల వందయానందములు పితృలోకమందలి జిత పితరులకొక యానందమగును. శ్రాద్ధమందలి పితరులు నివసిం చెడి స్థానము చంద్రునికంటెఁ బై భాగమున నున్నదని చూపఁబడి నది. సిద్ధాంత శిరోమణి యద్దానిని బుష్టీకరించినది. బృహదా రణ్యకము గూడఁ బితరులను మనుష్యులకంటె నధిక సుఖవంతు లనుగా నుల్లేఖించినది. జీవించియున్న పితరులు చంద్రునికంటెఁ బై భాగమునందుందురని యెవరేని చెప్పసాహసింతురా ? విచార

శీలుండగు వాండెవండును జెప్పంజాలండు. ఇంక జీవత్పితృశ్రాద్ధ మొనర్పవలెననెడి దానిలో నెంత పటుత్వమున్నదో పాఠకులే గ్రహింపగలరు.

—* భోగము *—

శ్రాద్ధమందుఁ బితరులకు భోగము (భోజనము) పెట్టెడి సమయమందీ వేదమంత్రము పఠింపఁబడుచున్నది.

"స్వధాపితృభ్యః పృథివిషద్భ్యః॥ ౭౮
స్వధాపితృభ్యోఽన్తరిక్ష సద్భ్యః॥ ౭౯
స్వధాపితృభ్యోదివిషద్భ్యః॥ ౮౦

అథర్వ॥ ౧౮॥౪॥౪

భూమియందున్న పితరులకీ యన్నమును సమర్పించుకొను చున్నాను. అంతరిక్షలోకమందున్న పితరులకీయన్నము నొసంగు చున్నాను. స్వర్గలోకమందున్న పితరుల కీయన్నము నిడుచు న్నాను, అని యర్థము.

ఈభోగమంత్రము లందంతరిక్షలోకమందుండెడి పితరులకును, స్వర్గలోకమునందుండెడి పితరులకును నీయన్న మొసంగుచున్నానని స్పష్టముగా వ్రాయఁబడినది. అంతరిక్షమందును, స్వర్గలోక మందును బ్రతికియున్న పితరులుండఁజాలరు. దీనింబట్టి యీ లోకమందా పితరులు మనుష్యశరీరమును విడిచి పితృలోక, స్వర్గలోకాంతరిక్షలోకాదుల కేగిరనియు వారి కొఱకే శ్రాద్ధాన్న

మిచ్చుచున్నాననియు నెఱుంగవలెను. అంతియేకాని జీవించి యున్న పితరులకు శ్రాద్ధమొనర్చుచున్నానని యెట్లు తలంపవల యును? మఱికొందఱు వేదమంత్రములో "ఈ యన్నమును భూమియందున్న పితరుల కొసంగుచున్నాననెడి యర్థముగల యొక మంత్రముగూడ నున్నదనియు భూమియందు జీవించియున్న పితరులే యుందురు గాన మృతులగు పితరులకు శ్రాద్ధమెట్లగునని యుననగలరు, దీనిపై విచారించి సమాధాన మీయవలెను. అంతరిక్షమందును స్వర్గలోకమందు నుండెడి పితరులు మృతులై నవారేయుందురు. జీవత్పిత లుండరు, ఇఁక భూమియందున్న పితరులన్ననో బ్రతికియున్న పితరులును, జచ్చిపోయిన పితరు లును గూడఁగాఁగలరు. ఇట్లొకసారిఁ జూడుఁడు ! మాపిత యొకఁడీ భూమినుండి శరీరమును విడిచిపోయి తాను సేసినకర్మ ములను బట్టి తిరిగి యీ భూలోకమందు జనించెను. ఇతఁడు మృతుఁడగు పితరుఁడు. ఇప్పుడు 'స్వధాపితృభ్యః పృథివిషద్భ్యః' అనెడి యీ మంత్రములోఁ జెప్పఁబడిన పితరులు జీవించియున్న వారా? లేక తొలుతవారు శరీరమును విడిచి తిరిగి కర్మాను సార ముగా శరీరమును ధరించి భూమి మీదికివచ్చిన పితరులా? యను నది చర్చనీయాంశమై యున్నది.

రెండు విధములుగా నుండు పదార్థముల యొక్కయో లేక రెండు విధములుగానుండు పితరులయొక్కయో యుపలక్షి యైనట్టి యిట్టిస్థానమునందుఁ బరిష్కరించుట కొఱకొక నియ మము గలదు. అదేదన ?

'సహచరతా సహచరతయోర్మధ్యే సహచరత స్యైవగ్రహణం

సహాచారి, యసహాచారియు ననెడి యీరెండువిధముల నుండు నుపలబ్ధియగుచున్న ప్రదేశమునందు సహాచారినే గ్రహింపవలయు నని యర్థము.

దీని యభిప్రాయమేమనగా, స్వర్గలోకాంతరిక్ష లోకము లందుండెడి పితరులే యిచ్చట శరీరమును విడిచివేసి పితృయోని కేగినవారై యున్నారు. భూలోకమందున్న పితరులు రెండు విధములుగానుందురు. మొదటివారు జీవితులై యే భూమిపై నివసింతురు. రెండవవారు భూమిపై మనుష్యశరీరమును విడిచి తిరిగి నిజకర్మానుసారముగా భూమిమీదికి వచ్చినవారు. గిట్టి తిరిగి భూమిమీదఁ బుట్టినవారు స్వర్లోకాంతరిక్ష లోకములం దుండెడి పితరులకు సహాచారు లగుదురు, ఎందులకనఁగా వారే మరణించి ద్యులోకాదులందు వేఱు శరీరమును ధరించి యుండి తిరిగి భూమిమీదికి నింకొక శరీరమును దాల్చి వచ్చి నందువలననే మృతులగు పితరులకు సహాచారు లయిరి. భూమిపై జీవించియున్న పితరులు అసహాచారు లగుదురు. సహాచారులనఁగా నెవరో యసహాచారు లనఁగా నెవరో స్పష్టీ కరించి యున్నాను. ఇప్పు డిచ్చటి నియమమువలన సహాచారియు నసహాచారియు నిరువురు దొరికిన తరుణమునందు సహాచారినే గ్రహింపవలయును. కావున నీనియమమును బట్టి స్వధా పితృభ్యః పృథివిషద్భ్యః అనెడి యీమంత్రముతోఁ దొలుత భూమిపై దేహమును త్యాగముచేసిపోయి తిరిగి నిజకర్మానుసా రముగా వేఱొక శరీరమును దాల్చి భూమిమీదికి వచ్చిన పిత

రులకే గ్రహణము గాఁగలదు. అంతరిక్షద్యులోకములందు నివ
సించెడి పితరులను బ్రతికియున్న పితరులని యెవఁడును జెప్పఁ
జాలఁడుగదా?

### పితృలోకగమనావలంబ మేది ?

మన సామాజకసోదరులు తమ వాదప్రాణమును దక్కిం
చుకొనుటకై వేదమం దనేకాసత్యకల్పనలను గల్పించుచుందురు.
వీరు కొందఱు బ్రతికియున్న పితరులు విమానములెక్కి చంద్రుని
కంటెఁ బైభాగమున సంచరింతురు. వారి విషయమునే యియ్యెడ
వేదము ల్లేఖించనది యనియుఁ జెప్పుట సంభవింపఁగలదు.
భూమిపై బ్రతికియున్న పితరు లాకాశముయొక్క మీఁదిభాగము
లోని కెట్లు ప్రవేశించునది తెలియఁబరచి యీ యనురోధమును
దూరీకరించుట యుచితము.

'ద్వేసృతీ అశ్రుణవమ్పితౄణామహం దేవానాముతమర్త్యానాం
తాభ్యామిదం విశ్వమేతత్సమేతి యదంతరాపితరం మాతరంచ॥

యజు॥ ౧౯అ॥ ౪౭॥

నేను వేదమువలన మరణధర్మము గలిగిన ప్రాణులకును,
దేవతలకును, పితరులకును బోఁదగిన మార్గములు రెండు గలవని
వింటిని. ఇవి ద్యులోకమునకును భూలోకమునకును నడుమ
నున్నవి. ఈ క్రియావంతమగు జగత్తు దేవయాన, పితృయాన,
మార్గములనుండి ప్రాప్తమగుచున్నది. భగవతి యగు శ్రీభగవ
తద్గీయు నీ రెండు మార్గముల నుత్తరాయణ దక్షిణాయనము
లనెడి నామములతో వ్రాసినది. కనుఁడు.

శ్లో॥ అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః, షణ్మాసా ఉత్తరాయణం
తత్ర ప్రయాతా గచ్ఛంతి, బ్రహ్మబ్రహ్మ విదోజనాః॥ ౨౪
ధూమో రాత్రి స్తథా కృష్ణః, షణ్మాసా దక్షిణాయనం
తథాచంద్రమసంజ్యోతి, ర్యోగీ ప్రాప్య నివర్తతే॥ ౨౫
భగవద్గీత అ॥ ౮॥

అగ్ని, జ్యోతి, శుక్లపక్షము, పగలు, ఉత్తరాయణము లనెడి వీని యభిమాన దేవతలు ప్రాపకులుగా నుండిన మార్గము నందు బ్రహ్మవేత్తయగు వాఁడుపోయి బ్రహ్మమును పొంద గలఁడు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము లనెడి వీని యభిమాన దేవతలు ప్రాపకులుగా నుండిన బాట యందుఁ గర్మయోగులు నడిచి చంద్రలోకమునకుఁ బోయి తిరిగి యరుదెంచుచున్నారు.

భగవద్గీత యీ మార్గములను ఉత్తరాయణము, దక్షిణాయనములనెడి పేళ్ళతో వ్రాసినది. మీఁదఁ జెప్పఁబడిన వేద మంత్రము దేవయానఁ పితృయానము లనెడి నామములతో చెప్పినది. దీనినే వేదాంతదర్శనము ఛాందోశ్యోపనిషత్తు, పంచాగ్నిమహావిద్య లనెడి నామములతో నుడివినవి. తమ శుభకర్మల ప్రభావమునుబట్టి పితృలోకమునకుఁ జనిన జీవుఁడు విమానమెక్కి యేగఁడు గాని ధూమ, రాత్ర్యభిమాన దేవతల సాహాయ్యముతో మరణించిన పిమ్మట నిటనుండి పోయి పితృలోకమునకు

ఈ పై విచారణమును బట్టి వివేకి యగు మనుష్యుఁడు పితృశ్రాద్ధము బ్రతికియున్న పితరులదని యెట్లు డు?

## పితరుల స్వరూప మెట్లుండును?

మన మొనర్చు శ్రాద్ధమందలి పితరుల శరీర మేరీతిగా నుండునో దానిని వివరించుచు వేద మిట్లు చెప్పుచున్నది.

"ఉదీరతామవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితరస్సోమ్యాసః
అసుం య ఈ యు రవృకా ఋతజ్ఞాస్తేనోవంతు పితరో హవేషు"

ఋ॥ మం ౧౦॥ అ౧॥ సూ౧౫॥ మం॥౧

దీనికి నిరుక్తమీరీతిగా 'ఉదీరతామవర ఉదీరతాంపర, ఉదీరతాం మధ్యమాః పితరస్సోమ్యాః సోమసంపాదినస్తేసుం యేప్రాణ మన్వీయూ రవృకా అనమిత్రాః సత్యజ్ఞాః వా యజ్ఞజ్ఞావా తేన ఆగచ్ఛంతు పితరో హ్వానేషు మాధ్యమికో యమ ఇత్యాహు స్తస్మాన్మధ్యమికాన్పితౄన్మన్యంతే' విశదీకరించినది. అనఁగా క్రిందనున్న పితరులు మీఁదికిఁ బోదురుగాక! ఉత్తము లగు పితరులు మీఁదికిఁ బోదురుగాక! మధ్యయందుండు పితరులు మీఁదికిఁ బోదురుగాక! సోమము సిద్ధము చేయువా రలును, ప్రాణములను బొందినవారును, వాయురూపముగల వారును, శత్రువులు లేనివారును, యజ్ఞము నెఱింగినవారును నగు పితరులు నా యాహ్వానముపై వచ్చెదరుగాక! యముఁ డంతరిక్షముయొక్క మధ్యభాగమునందుండెడివాఁడు. ఇతఁడు పితరులయొక్క రాజని యనెదరు. కాఁబట్టి పితరులను మాధ్య మికులని తలంచెదరు. ఈ వేదమంత్రములోఁ బితరుల శరీరము వాయురూపముగాఁ జెప్పఁబడినది, పితృలోకమునందు మృత్తిక పరమాణువుగూడ లేదు. ఈకారణమువలననే యాలోకమందలి

శరీరములలోఁ గూడ మృత్తికాంశములేదు. ఈ భావమునే గ్రహించి యీ వేదమంత్రము పితృశరీరమును వాయురూపముగా వర్ణించినది. వేదమంత్రము పితరుల శరీరమును వాయు రూపముగా వర్ణించినప్పు డెవఁడు వేదములో జీవత్పితృశ్రాద్ధము నుడువఁబడిన దని చెప్పఁగలఁడు? బ్రతికియున్న పితరులు కేవలము వాయురూపము గలవారా యేమి? కారు. దీనిని బలపరచెడి వాత్స్యాయన మహర్షి న్యాయదర్శనముయొక్క 3॥ ౧॥ ౨౮వ సూత్రముయొక్క భాష్యమును గూడఁ జూడుఁడు.

"అప్యతైజస వాయవ్యాని లోకాంతరే శరీరాణి"

లోకాంతరమందు జల, వహ్ని, వాయు శరీరములు గలుగును. పితరుల శరీరము మృత్తికా పరమాణువులు గలది గాదు. ఈ కారణము వలన నా శరీరములు మనుష్యులకుఁ గన్పట్టవు. ఇంకను దీనింగూర్చి శతపథబ్రాహ్మణ మిట్లు నుడువుచున్నది.

'తిరహవనై పితరో మనుష్యేభ్యః॥

శత॥౨॥3॥౪॥౨౧

సూక్ష్మరూపులైన కారణము వలనఁ బితరులు మనుష్యులకుఁ గన్పడకుందురు, మనువు గూడఁ బితృస్వరూపమును గురించి యిట్లు చెప్పుచున్నాఁడు.

'నిమంత్రితాని పితరః, ఉపతిష్ఠన్తి తాన్ద్విజాన్

గచ్ఛంతి, తథా సీనానుపాసతే॥ మను॥3॥౧౮౯

తరులు బ్రాహ్మణులతోఁ గూడ వాయురూప

మును బొంది యేతెంచి వారివెంబడి గూరుచుండి భుజించెదరు. వేదము, వాత్స్యాయన భాష్యము శతపథబ్రాహ్మణము, మను స్మృతి, పితరుల శరీరమును సూక్ష్మమగు వాయురూప మని చెప్పినవి. మీ జీవించియున్న పితరులు గూడ వాయురూప శరీరము గలవారేనా? అట్లుగానియెడలఁ దిరిగి మీరు బ్రతికియున్న పితరులకు శ్రాద్ధ మెట్లు చెప్పుచున్నారని సామాజిక సోదరుల నడుగుఁడు. ఏమి ప్రత్యుత్తర మిత్తురో

పితరులకు రాజు గలఁడా?

వేదములందు యముఁడు బితరుల రాజుగాఁ జెప్పఁబడినాఁడు. ఇందువలననే యమరాజునకు శ్రాద్ధమునందు భాగము గూడ నుంచఁబడును. దీనింగుఱించి వేద మిట్లు వచించుచున్నది

'యమాయ సోమః పవతే, యమాయ క్రియతే హవిః।
యమం హ యజ్ఞో గచ్ఛ త్యగ్నిదూతో అరంకృతః

అథర్వ॥౧౮॥౨॥౧

యమునికొఱకు సోమము చేయఁబడుచున్నది. యమునికొఱకు హవిస్సు గావింప బడుచున్నది. దూత యగు అగ్నియే మంత్ర ముఖమున యజ్ఞమునుండి యాజ్యాది హవిస్సును యమునకుఁ దీసికొనిపోవుచున్నాఁడు. యముఁడు బ్రతికియున్న పితరుల రాజా? మృతులగు పితరుల రాజా ? యనెడి విషయ మీ క్రింది మంత్రములవలన స్పష్టము గాఁగలదు. గృహములో నుండి మృతకుని శరీరమును లేవఁదీసికొని పోవునప్పుడీ వేద మంత్రము పఠింపఁబడుచున్నది.

'అపేమం జీవా అరుధన్ గృహేభ్యస్తం నిర్వహత పరిగ్రామాదితః । మృత్యుర్యమస్యాసీద్దూతః ప్రచేతా అసూన్పితృభ్యోగమయాం చకార॥

అథ॥౧౮॥౨॥౨౭

ఓజీవించియున్న పురుషులారా! ఈ శవమును గృహములో నుండి వెలుపలకుఁ దీసికొనిపొండు! దానిని నూరిబైటకుఁ గొని పొండు. యమరాజుయొక్క దూతలు బుద్ధిమంతులు. గొప్ప వారు. మృత్యువనెడి పేరుగలవారు. వీరు చచ్చినవారి ప్రాణములను బితరులనుగాఁ జేయుటకు యమలోకమునకో, పితృలోకమునకో చేర్చుదురు.

మృతునికళేబరముంచిన చితయందు వడ్లు నువ్వులను బోసెడిసమయమందీ మంత్రమును బఠింపవలయును.

"యాస్తే ధానా అనుకిరామి తిలమిశ్రాస్స్వధావతీః
తాస్తే సంతు విభ్వీః ప్రభ్వీస్తాస్తే యమోరాజానుమన్యతాం॥
అథర్వ॥౧౮॥౩॥౬౯

ఓప్రేతా! తిలలతోఁ గూడిన వడ్లు 'స్వధా' యుక్తముగా నీనిమిత్తము విడువఁబడుచున్నవి. ఇవి నీనిమిత్త మతిశయముతై ప్రభావముగలవియై యుండుగాక. యమరాజు ఆ తిలధాన్యమును నీకొఱకుఁ బరిగ్రహించుగాక. చితయం దగ్ని చక్కగా మండుచున్నతఱి నీమంత్రము పఠింపబచుచున్నది

ప్రేహి ప్రేహి పథిభిః పూర్వ్యేభిర్యేనాతే పూర్వే పితరః పరేతాః ఉభా రాజానౌ స్వధయామదన్తా యమంచ పస్యసి వరుణంచ దేవం॥

అథర్వ॥౧౮॥౧॥౫౪

నీపూర్వులగు పితరులు చచ్చి యేయేమార్గములందుఁ బోయిరో యమనిర్మితములగు నాయాశరీరయాన రూప మార్గములందుఁ బొమ్ము! అచట స్వధా యనెడి పేరు గల యన్నమువలనఁ బ్రసన్నత బొందుచున్నవారును, ప్రకాశమానులును, రాజులును నగు యమ, వరుణ, దేవులనెడి నిరువురను జూడఁగలవు.

పితరులకుఁ బ్రభువైన యముఁ డెవఁడను విషయమును గురించి వేదమిట్లు చెప్పుచున్నది.

'యో మమార ప్రథమో మర్త్యానాం, యః ప్రేయాయ ప్రథమో లోకమేతం వైవస్వతం సఙ్గమనం జనానాం, యమం రాజానం హవిషాసమర్యత॥ అథర్వ॥౧౮॥౩॥౧౩

ప్రాణులలోఁ దొలుతఁ జచ్చినవాఁడును, ఈలోకమును మొదట దీసికొనిపోవువాఁడును, అట్టి సుఖముకొఱకు జనుల సంగమనము చేయించువాఁడును సూర్యపుత్రుఁడును నగు యమధర్మరాజు, హవిస్సుతో సత్కరింపఁ బడుచున్నాఁడు.

ఇప్పుడు పాఠకులు స్వయముగానే యముఁడు 'బ్రతికి యున్నవారికి రాజా? చచ్చినవారికి రాజా? యను సంగతినిదెలిసి కొనియుందురు. యమునిఁ బితృరాజు గాఁజెప్పి యముండురాజు

గాఁగల యాపితరుల శ్రాద్ధవిధి చెప్పఁబడినది. వీరు బ్రతికియున్న పితరులా? చచ్చినపితరులా? యనునది స్పష్టమైనదిగదా. కాఁబట్టి విశేషించి వ్రాయవలసిన యవసరము లేదు. ఈప్రకరణమం దార్య సామాజికులు గలఁత జెందిపోయిన వృత్తాంతమును గొలఁదిగా వినిపించెద. ఆర్యసామాజికులు ఛపరాగ్రామమందుఁ జరిగిన శాస్త్రార్థమహాసభలో వ్యాకులపడి సమీపమునందుఁ గూర్చుండియున్న రక్షకశాఖాసహాయ విచారణకర్త (పోలీస్ సబ్ ఇన్స్పెక్టరు) గారినే యమునిగాఁ జూపించిరి. అందే మరియొక శాస్త్రార్థసమయమందు దండనాధికారి (మేజిస్ట్రేటు)ని యము నిగాఁ జూపించిరి. కురారాగ్రామ శాస్త్రార్థమం దార్యసమాజ పండితుఁడు యమపదమున కర్థము దండనాధికారి (మేజస్ట్రేటు) యని చేసెను. అప్పుడు సనాతనధర్మీయ పండితుఁడ నగు నేను 'ఇదేమి! మీరేమి చేయుచుంటిరి? అపేమం జీవా యనెడి మంత్రములో యముని దూతయగు మృత్యువు మనుష్యుల ప్రాణములను దీయునని వచింపఁబడినది. ప్రపంచమునం దే దండనాధికారి భటుడు మనుష్యులను జంపుచున్నాఁడో చూపుఁడు? యాస్తే ధానా అనుకిరామి యీమంత్రములో మృతశరీరజీవాత్మతో నీకొఱకు నేఁ జల్లిన తిలమిశ్రిత ధాన్య మును యముఁడు స్వీకరించునుగాక! యని నుడువఁబడినది. అప్పుడు చితయందుఁ బారఁబోసిన నువ్వులను ధాన్యమును దండనాధికారి (మేజస్ట్రేటు) వచ్చి యేరుకొనుచున్నాఁడాయేమి? ప్రేహి, ప్రేహి, యీమంత్రములో నీపూర్వులగు పితరులు చేరిన యా పితృలోకమునకు నీవు పొమ్ము! అచటికిఁ జేరి నీవు

యమధర్మరాజును జూడఁగలవని చెప్పఁబడినది. ప్రపంచములో నున్న దండనాధికారులు(మేజస్ట్రీట్లు) చచ్చినతరువాత యముని జూడఁగలరా? బ్రతికియున్నప్పుడు చూడరా? ఇంకను 'యోమమార ప్రథమో మర్త్యానాం' అనెడి యీమంత్రములో నందఱకంటె ముందుగాఁ జచ్చినవాఁడును, నందఱికంటె ముందుగాఁ బితృలోకమునకు జేరినవాఁడును, సూర్యుని కుమారుఁడును నగు యమునకు మేము హవిస్సు నిచ్చుచున్నామని పలుకఁబడి నది. ఇప్పటికినీ దండనాధికారి (మేజస్ట్రీట్) బ్రతికియున్నాఁడు గదా? దండనాధికారులందఱు (మేజస్ట్రీట్లు) సూర్యునికొడుకు లేనా? వీరికి శ్రాద్ధములం దెవఁడు హవిస్సానంగును? ఈ రీతిగా మీరేదో సాకు జెప్పి యేల తప్పించుకొనెదరు? అర్థము సరిగాఁ జేయుఁడు. ఇట్లనుచుండఁగానే యార్యసామాజ పండిత మహారాజుగారు తబ్బిబ్బులాడెను. శ్రాద్ధము నెగురగొట్టుట యందు వారు తమ నాస్తికబుద్ధి నుపయోగింతురు. కాని టక్కరితనము గలవారు గుట్టు బట్టబయలగుటతోడనే పడిపోవు దురు. యముఁడు రాజుగా గల పితరులు బ్రతికియున్న పితరులని యెవఁడనగలఁడు? అనిన వాఁడు సమర్థించుకొనఁగలఁడా? సమర్థింపఁ బూనిన వాఁడు హాస్యాస్పదుఁడు కాకుండునా? ఉండఁడు.

### పితరులకు పిలుపు గలదా?

వేదము శ్రాద్ధమునందుఁ బితరులయాహ్వానము (పిలుపు) చెప్పియున్నది.

'యే నిఖాతా యే పరోప్తా యే దగ్ధా యే చోద్ధితాః।
సర్వాం స్తా నగ్న ఆవహ పితౄ్న్ హవిషే అత్తవే॥

అథర్వ॥౧౮॥౨॥౩౪

ఓ అగ్నీ! గోతిలోఁ బూడ్చఁబడిన పితరులను, అడవియందువిడువఁ బడిన పితరులను, గాల్పబడినపితరులనుశరీరముతోఁ గూడ స్వర్గమున కేగిన పితరులను, వీరినందఱను హవిస్సును భుజించుట కొఱకుఁ బిలువుమని యర్థము. ఈ మంత్రములో శ్రాద్ధకర్త, యెవరిశరీరములుగోఁతులలోఁ బెట్టఁబడినవో, యెవరి దేహము లడవులందు విడువఁబడినవో, యెవరి శరీరములు కాల్చఁబడినవో, యెవరి కాయములు స్వర్గమునకుఁ బోయినవో యిట్లు నాల్గు తెఱఁగులుగా నుండు పితరులను బిలువు మన్నట్లున్నది. ఇవి భువిపై బ్రతికియున్న పితరుల శరీరము లందు ఘటింపఁజాలవు. మృతులగు పితరులయందే ఘటింపఁగలవు. కనుకనే యీమంత్రము నందు మృతులగు పితరుల యావాహనమే యున్నది. కాన్పూరు నందు జరిగిన శాస్త్రార్థమందీ మంత్రము నార్యసామాజిక పండితుఁడగు బ్రజమోహనఝాగారు కినిసి యేమియుఁ దోఁచక యీమంత్రములో గెనుసుగడ్డ వర్ణన మున్నదని చెప్పఁదొడఁగెను. అదెట్లు? సమన్వయము చేసి చెప్పవలసిన దని నే నింతమాత్ర మనినతోడనే యతఁడు కలఁతపడి గ్రుడ్లు మిణకరింపం దొడఁగెను. ఎవ రెన్ని పన్నాగములఁ బన్నినప్పటికి మంత్రములోనున్న యావాహనము బ్రతికియున్న పితరులది యెంతమాత్రము గాదు. దీని తరువాతి మంత్రమును గూడఁ జూడుఁడు.

యే అగ్నిదగ్ధా యే అనగ్నిదగ్ధా మధ్యే దివస్స్వధయా మాదయంతే త్వం తాన్వేత్థ యది తే జాతవేదః, స్వధయా యజ్ఞం స్వధితిం జుషంతాం॥

అథర్వ॥౧౮॥౨॥౩౫

ఓ అగ్నీ! అగ్నియందుఁ గాలినవారై, కాలియుండని వారై, ద్యులోకమం దమృతరూపమగు నన్నముచేఁ బ్రసన్నులై యున్నవారిని నీవు దెలిసికొనియున్నయెడల వారందఱు నీద్వారమున స్వధవలనఁ బితృసంబంధమగు యజ్ఞమును సేవింతురుగాక!

కొందఱార్యసామాజికులు 'అగ్నిదగ్ధా. అనగ్నిదగ్ధా,' యనెడి పదములకు అగ్నివిద్య నెఱిఁగినవారును, నగ్నివిద్య నెఱుంగనివారనియు నర్థము చెప్పుదురు. కాని 'మధ్యే దివస్స్వధయా మాదయంతే' యనెడి యీచోటికి వచ్చి వ్యాకులపడెదరు. అగ్నివిద్యాభిజ్ఞులు, అగ్నివిద్యానభిజ్ఞు లని యర్థము చెప్పి తమ ప్రాణములం గాపాడుకొనుటకుఁ బ్రయత్నింతురు. కాని సనాతనధర్మీయపండితుఁడీయర్థ మెట్లుచేసితిరో కొంచెదిగా వినిపింపుమని గట్టిగా నడిగినప్పుడు వ్యాకులపడుదురు. ఈ మంత్రము వేదముయొక్క మూడుసంహితలలోను గలదు.

యజుర్వేదసంహితయందు 'అగ్నిదగ్ధాః యనుచోట అగ్నిష్వాత్తాః అనియు' అనగ్నిదగ్ధాః అనుచోట అనగ్నిష్వాత్తాః యనియుఁ బాఠాంతరము గలదు. ఈ రెండు పదములు గల చోట ఋగ్వేదసంహితలోని మంత్రములో 'అగ్నిదగ్ధాః అనగ్నిదగ్ధాః' పదములు గలవు. మఱియు నీ రెండుపదములే

యథర్వసంహితయందును గలవు. ఇఁక మధ్యేదివః అను మొదలగువానిపాఠము మూఁడు వేదములందు నొకటిగానే యున్నది. దీనింబట్టి ఋగథర్వవేదములలో 'అగ్నిదగ్ధాః అనగ్నిదగ్ధాః' అని యెవరినిం గూర్చి చెప్పఁబడినదో వారినే యజుర్వేదము 'అగ్నిష్వాత్తాః అనగ్నిష్వాత్తాః' యని చెప్పినది, ఋగథర్వవేదములం దగ్నిష్వాత్తా అనగ్నిష్వాత్తా శబ్దము లామంత్రములో లేవు. ఇట్లే అగ్నిదగ్ధా అనగ్నిదగ్ధా పదములు యజుర్వేదమునందు లేవు. దీనింబట్టి అగ్నిష్వాత్తా అనగ్నిష్వాత్తా, అగ్నిదగ్ధా అనగ్నిదగ్ధా అను పదముల కొకయర్థమేయని తెలియుచున్నది. పాణినీయమగు వ్యాకరణము ననుసరించి 'అగ్నినా స్వాదితాః అగ్నిష్వాత్తాః. అగ్నినా దగ్ధాః అగ్నిదగ్ధాః' అని యీశబ్దముల కర్థమై యున్నది. కాల్చెడి ఆవస్థ్యాద్యగ్ని, యెవరిని రుచిలేక యగ్ని యెవరిని దగ్ధము జేసినదో యాపితరులు అగ్నిష్వాత్తాః లేక అగ్నిదగ్ధాః అని పలుకఁబడుదురు. రెండవది ద్యులోకమందు అమృతరూపమగు నన్నముచేఁ బ్రసన్నులై యున్నవారు. మూఁడవది అగ్నిదేవుఁ డట్టివారి నెఱుఁగును. నాల్గవది. ఆపితరు లందఱు నగ్నిదేవుని ద్వారమున 'స్వధ'ను సేవించుచుందురని చెప్పఁబడినది. ఈనాల్గు విషయములు గూడ బ్రతికియున్న పితరులకు సంఘటింపఁజాలవు. ఇఁక నేన్యాయమునుబట్టి యగ్నివిద్య దెలిసినవారును నగ్నివిద్య దెలియనివారును నగు బ్రతికియున్న పితరులీ మంత్రమునందు గ్రహింపఁబడిరని యంగీకరింపవలయును?

యజుర్వేదములోఁ బితరులనుండి యాశీర్వాదముగోరెడి పట్టున నీమంత్రము నుడువఁబడును.

యే సమానా స్సమనసో జీవా జీవేషు మామకాః
తేషాగ్ం శ్రీర్మయి కల్పతా మస్మిన్లోకేశతగ్ం సమాః॥
యజు. అ. ౧౯॥ ౪౬॥

సమానవ్యవహారము గలవారును, మనస్వులు (మంచివారు) నగు నాపితరులయొక్క సిరిసంపదలు నా సమీపమున వందల కొలఁది సంవత్సరములు నిలుచుగాక. ఈయాశీర్వాదము మృతు లగు పితరులనుండియే శ్రాద్ధాంతమందుఁ గర్తలు గోరఁజాలు దురుగాని జీవించియున్న పితరులనుండి యర్థింపఁజాలరు. ఎందుల కనఁగా జీవించియున్న పితరుల కొకనాఁడు భోజనము పెట్టి వందలకొలఁది సంవత్సరములవఱకుఁ దఱగని వారి ధనమును గోరినయెడల నా బ్రతికియున్న పితరులు మీరు శ్రాద్ధ మొనర్చు చున్నారా? లేక మీయొకపూటభోజనమునకు మా సిరిసంప దలఁ గొల్లకొట్టఁదలఁచి విక్రయపత్రముపై వ్రాయించుకొను చున్నారా? యని యడుగఁగలరు. ఒకపూటకూటికై యింత సొమ్మును బ్రతికియున్న పితరులు మీకొసంగఁజాలరు.

కొందఱార్యసామాజికులు 'జీవాజీవేషు' అనెడి యీ పదములను గని యీ మంత్రములో జీవించియున్న పితరులే యని యర్థము వచింతురు. కాని యీరీతిగాఁ జెప్పువారు వేదముపై విశ్వాసముంచని కారణముచేత మోసగించుచుం దురు. జీవశబ్దమున కర్థము జీవితుఁడను నర్థమెన్నటికినిగాదు.

నిరుక్తము, నిఘంటువు, వ్యాకరణగ్రంధము మున్నగు వానిలో నేదియుగూడ జీవశబ్దమున కర్థము జీవితుఁడని చేసి యుండలేదు. మహోబా యను గ్రామమున జరిగిన శాస్త్రార్థ మందు సనాతనధర్మీయపక్షమునఁ బండిత చర్ఝూరాంగారీ మంత్రమును బెట్టెను. శివశర్మ యనెడి యార్యసామాజికుఁడు తన టక్కరితనముతో జీవశబ్దమునకు జీవితుఁడని యర్థము చెప్పెను. ఈమాట విని చర్ఝూరాంగారీ జీవశబ్దమున కర్థము జీవితుఁడగునా? ఇందులకుఁ బ్రమాణ మొసంగుఁ డని యడిగెను. అంత శివశర్మ, పండితరామాశ్రయ, పండిత నందకిశోర దేవ, యను నామములు గల యార్యసామాజిక పండితులు పెద్దపెద్ద పెక్కుపన్నాగములను బన్నఁబూనిరి. కాని యొకటిగూడ సాగలేదు. చిట్టచివరకుఁ దత్సభ కధ్యక్షులును, యూరోపియనులును, విద్యాధికులును, నాగరికులునునగు శ్రీ జంట్ మహోబా కలెక్టరు దొరవారాతరుణమందు లేచి నిలుచుండి యజుర్వేదమందలి మంత్రమునకుఁ బ్రత్యుత్తర మార్యసమాజ మందేదియు లేదు. కాఁబట్టియే యీనాఁటి శాస్త్రార్థములో సనాతనధర్మపక్షమునకు విజయము గలిగిన దని నొక్కిచెప్పెను. మొదటిసంగతి. ఎవ రెంత తంటాలు పడినను జీవశబ్దమునకు జీవితుఁడనెడి యర్థ మెన్నటికిని సిద్ధింపజాలదు. రెండవది. పితరులిచ్చిన సిరిసంపదలు యావత్తు మాయొద్ద నుండునో వారెచ్చట నుందురో యను విషయమును విమర్శించుచు వేద మీమంత్రముకంటె పూర్వమందున్న యొక మంత్రములో ఈ పితరులు యమరాజ్యమునందు నివసింతురని చెప్పినది.

"యేసమానాస్సమనసః పితరోయమరాజ్యే
తేషాంలోకస్స్వధానమోయజ్ఞోదేవేషుకల్పతాం॥

యజు॥ ౧౯॥౪౫

జాతిరూపాదులచే సమాన వ్యవహారము గలవారును, ఏకమనోవృత్తిగలవారును, నగు మా పితరులు యమ రాజ్యములోనున్నారు. అట్టి పితరుల లోకమందు స్వధయనుపేరుగల యన్నము దృష్టిగోచరమగుగాక. యజ్ఞములు దేవతలకుఁ దృప్తి గలిగించుటకు సమర్థమగుగాక. దీనిపై శతపథ బ్రాహ్మణ మిట్లు పలుకుచున్నది.

"పితౄన్నేవయమేపరిదదాత్యథోపితృలోకమేవజయతి"

శత॥౧౨॥౮॥౧॥౧౯॥౪౫

యమలోకములోనున్న పితరులకు స్వధనామము గల యన్నము సమర్పించువాఁడు పితృలోకమును జయించును. ఇఁక నార్యసామాజికుల నోరును గొంచెము మెదల్పఁ జేసెడి యొక మంత్ర మిట్లున్నది.

'యేచజీవాయేచమృతా యేచజాతాయేచ యజ్ఞియాః
తేభ్యోఘృతస్యకుల్యైతు మధుధారావ్యున్దతీ॥

అథర్వ॥౧౮॥౪॥౫౭

ఏజీవులు చచ్చిరో యేజీవులు గిట్టిపుట్టిరో యేజీవులు యజ్ఞమొనరించెడివారో వారికెల్లరకు నేయిగారుచున్న మధుధారల సరిత్తు (నది) ప్రాప్తమగుగాక. యని యర్థము.

దీనిం బట్టికొని కొందఱు బ్రతికియున్న పితరుల శ్రాద్ధమును సిద్ధింపఁజేయ బూనెదరు. 'మృతాః' అనెడి పదముపైఁ జెప్పరు గాని 'జీవాః' యనెడి పదముమీఁద జీవత్పితృశ్రాద్ధమును నిర్ణయింతురు. మృతాః అనెడి పదమన్ననో యీ మంత్రమందు స్పష్టముగా నున్నది. ఇది నిర్వివాదము. దీనివలన మృతకశ్రాద్ధమును వేదమే విధించినదని తేటతెల్లము. ఇఁక మిగిలినది 'జీవాః' అనెడి పదము. ఈ జీవపదమున కర్థము జీవితుఁడని యెంత మాత్రము గాదని యీవఱకే నిరూపింపఁ బడినది. తిరిగి యీ మంత్రమునుబట్టి జీవత్పితృశ్రాద్ధము చెప్పుట మూఢుల కన్నులలో మట్టి గొట్టుటయే. శ్రాద్ధవిషయమును గూర్చి కొన్ని మంత్రముల నింక నిచ్చెదను. అవిగూడఁ బరికింపుఁడు.

"యేనః పూర్వేపితరస్సోమ్యాసోఽనూహిరేసోమపీథంవసిష్ఠాః తేభిర్యమఃసగ్ంరరాణోహవీగ్ంష్యుశన్నుశద్భిః ప్రతికామమత్తు"॥

యజు॥౧౯॥౫౧॥

సోమమును సంపాదించెడి వసిష్ఠుని వంశమందు జన్మించిన నాపూర్వులగు పితరులు సోమపానము కొఱకు దేవగణమును బిలిచిరి. సోమమునుగోరు పితృపతి, యాసోమము నభిలషించెడి పితరులతోఁగూడఁ బ్రసన్నుఁడగుచు యథేష్టముగా నే నిచ్చెడి హవిస్సులను భుజించుగాక.

"ఆయన్తునః పితరస్సోమ్యాసోఽగ్నిష్వాత్తాఃపథిభిర్దేవయానైః అస్మిన్యజ్ఞేస్వధయామదన్తోఽ ధిబ్రువన్తుతేన్వవస్మాన్॥ ౫౮

సోమమునకు యోగ్యుఁడగు నగ్నిహోత్రుని ద్వారమున ననుభవింపఁబడిన లేక స్మరింపఁ బడిన నాపితరులు దేవతల రాకపోక

లకు యోగ్యమగు మార్గమునుండి వచ్చెదరుగాక. ఈయజ్ఞ మందన్నముచేఁ బ్రసన్నులగుచు మానసికమగు హితోపదేశము చేయుదురుగాక. వారు నన్ను రక్షించెదరుగాక !

"యేనః పితుః పితరోయే పితామహాయ ఆవివిశురుర్వ న్తరిక్షం।
యఆక్షియన్తి పృధివీముతద్యాం తేభ్యః పితృభ్యోనమసావిధేమ॥
అధర్వ॥ ౧౮॥ ౨॥ ౪౯

నా తండ్రికిఁ బితరులెవరో నాతాతలెవరో గొప్ప పితృ లోకమందుఁ బ్రవేశించిన వారెవరో పృధివియందును ద్యులోక మందును వ్యాపించియున్న వారెవరో యాపితరులకెల్లరకు నన్న మును లేక నమస్కారమును విధిపూర్వకముగా నిడుచున్నాను.
"యేనఃపూర్వే" యీ మంత్రములో నున్న హవిస్సులు యమరాజుతో గూడిన పితరులు భుజించినట్లుగాఁ జెప్పఁబడి యున్నది. "ఆ యన్తునః"

యీ మంత్రములో అకాశమార్గమునుండి పితరులు పిలు వఁబడి యున్నారు. 'యేనఃపితుః' యీ మూడవ మంత్రములోఁ బితరు లంతరిక్షమార్గమునందుఁ బ్రవేశించినట్లుగా నున్నది. ఈ కారణములనుబట్టి యీ శ్రాద్ధస్థలములోఁ జచ్చిన పితరులే గ్రహింపఁబడుచున్నారు. వేదములం దనేక ప్రదేశములలో మృతపితృ శ్రాద్ధము చెప్పఁబడి యున్నది. వేదములను విశ్వ సించెదమని చెప్పి లోకమును మోసగించుచు వేదమందు జెప్పఁ బడిన మృతకశ్రాద్ధమును నమ్మకపోవుట యార్యసామాజికుల

యొక్క నాస్తికతరుఁ బ్రబలంబును, ఖండింప వీలులేనిదియు నగు ప్రమాణమై యున్నది.

ఈ ప్రమాణములకు సరియైన శాస్త్రీయ ప్రత్యుత్తరములను వ్రాసి జీవత్పితృశ్రాద్ధము వేదవిహితమని నిరూపింపఁజాలిన యార్య సామాజికుఁడు గాని మఱియొక నాగరకుఁడు గాని యీ క్షణము వఱకును నాదృష్టిలో లేఁడు. ఇప్పుడును లేఁడు ముందుండఁడు. కాని మనసారఁ దలఁచినట్లు నాలుక తిరిగినట్లు కలమాడినట్లు జీవత్పితృ శ్రాద్ధమును దలంతురు. వచింతురు. లిఖింతురు. ఇట్టివారిని నెవ్వారును నడ్డగింపఁజాలరు. వారి చిత్తమే చిత్తము.

వైదికప్రకరణము సంపూర్ణము.

---

# తర్క ప్రకరణము



మా యభినవ నాగరకులగు సోదరులు వైదిక సిద్ధాంత మందుఁ దమ పరాజయమును దెలిసికొనిన వెంటనే యసత్యములఁ గల్పించియు, వాదించియు, మోసగించియుఁ దలక్రిందులగుచుఁ దిమ్మిని బ్రమ్మిని, బ్రమ్మిని దిమ్మినిగాఁ జేసి యుక్తులను ఆశ్రయింతురు. వీరు యుక్తుల విషయమందు మాకే విజయము సిద్ధమని తీర్మానించుకొని యుందురు. వీరి యీ మనోరథము వృథయగునది తెలియదు. వీరి యుక్తుల నొక్కొక్కటి మీ యెదుటఁబెట్టి ప్రత్యుత్తర మిచ్చుచుందును. కనుడు.

ఒకఁడు చేసిన కర్మముయొక్క ఫల మింకొకనికి సంక్రమించునా?

(1) ఒకనిచేఁ జేయఁబడిన కర్మముయొక్క ఫల మింకొకని కెట్లు చెందును? అనునది వారి మొదటి యుక్తి.

ప్రత్యుత్తరము:— ఎంతమంచి యుక్తి! పండ్రెండేండ్లు పరిశ్రమ చేసి మా బాబుగారు బి. ఏ. యను నొక బిరుదమును (టైటిల్ లేక డిగ్రీ) బొందెను. ఈ బి. ఏ. పరీక్షయందుఁ గృతార్థుఁడైనను వీని బుద్ధిస్థాపత్యము (ఇంజనీరింగ్)నందుఁ బ్రవేశించి పని చేయఁజాలదు. బి. ఏ. బిరుదమును బొందినను భూగర్భ విద్యలో నితఁడు నేర్పరి గాఁజాలడు. బి. ఏ. యైనప్పటికిని వైద్య విద్య (డాక్టరీ) యందు మహా మూర్ఖుఁడుగా నితఁ డుండును.

ఇఁక వీరు వేదములపై యుక్తి ప్రయుక్తుల నెందులకు లేవఁదీయు దురో తెలియఁజాలకున్నాను. వీరు వేద మేదో సామాన్య మత గ్రంథముగాను, వేదమును బ్రకాశింపఁజేసిన పరమేశ్వరుఁడు కుళ్ళిపోయిన మెదడు గలవాఁడుగాను, దలఁచినట్లు తోఁచు చున్నది. వేదములపై వీరు యుక్తుల నేమి చెప్పఁగలరు? పంద్రెం డేండ్ల బుద్ధితోఁ బోరాడినప్పటికిని వీరికి వైదికవిజ్ఞానముయొక్క తత్త్వము బోధపడఁజాలదు, పరిశ్రమ చేయకయుఁ బట్టుదలఁ బట్టకయు నమ్మకము లేకయు సద్గురుని కృప సంపాదింపకయుఁ బరమేశ్వరీయ విజ్ఞానముతో వేదము ప్రకాశించిన దనెడి విషయ మీతని బుద్ధియందుఁ బ్రవేశించుటయే యసంభవము. వేద విజ్ఞాన మెఱుఁగక సర్వజ్ఞత్వముతోఁ బ్రవృత్తికిఁ దాసులగుచుఁ దమ యుక్తులతో వేదము నే రీతిగా నసత్యమని సిద్ధింపఁజేసెదరో నాకుఁ దెలియకున్నది. చార్వాకులు, బౌద్ధులు మున్నగు ప్రబల నాస్తికులు వేదవిజ్ఞానము యొక్క ముంగల తమ బుద్ధియందలి కల్పనల నసత్యములనియు నూహాజన్యములనియుఁ దలంచి వేద పాదములపైఁబడియున్నప్పు డిఁక వారికిఁ గృత్రిమ శిష్యులగు వీరు వేదవిషయముపై నెట్లు విజయులు గాఁగలరు? కానేరరు. ఇది విన్న యార్య సామాజికులు భళీ! సింగి నీళ్ళాడిన సింగఁడు మోడీకారము తినినట్లును, ఉపాధ్యాయుఁడు కరకకాయ దినగా విద్యార్థికి విరేచనము లగుట సంభవమనినట్లు సనాతన ధర్మీయ వాద మున్నదని యందురు. అనఁగా వీరు పై వెట్లసంభవములో యట్లే ప్రపంచము దంతట నొకరి కర్మఫల మింకొకరికిఁ జెందదని చెప్పెదరు. కాని వీరు వ్యాకరణ శాస్త్రము జదివి బుద్ధిని విని

యోగించి యుండినచో నీ దిగువ సంగతిని గ్రహింపఁగలరు. ఉభయ పది ధాతువులలో 'ఆత్మనేపదములు పరస్మైపదములు' అనెడి రెండు విధముల నుండు క్రియ లుండును. ఎందుఁ గ్రియా, ఫలము కర్తయందు నిలుచునో యం దాత్మనే పదరూపమును నెందుఁ గ్రియాఫలము కర్తకంటె భిన్నమం దగునో యందుఁ బరస్మైపదరూపమును నుపయోగింపఁబడుచున్నవి. రాజు స్వయముగా యజ్ఞము చేయునప్పుడు 'యజతే' క్రియ వాడబడును. ఇఁక రాజు స్వయముగా యజ్ఞ మొనరింపక తన ప్రతినిధిచేఁ జేయించినప్పుడు 'యజతి' యనెడి క్రియాపద ముచ్చరింపఁ బడును. యజ్ఞములో సర్వకార్యములను రాజుయొక్క ప్రతినిధి సేయుచుండును. కాని దాని ఫలము రాజునకే చెందుచున్నది శత్రువుల దేశములను వీరులగు రాజభటులు గెల్తురు. కాని యీ గెల్చిన శత్రురాజ్యముపై నధికారము రాజునకే కలుగును దీనిమీదమాత్ర మన్యునిచేఁ జేయఁబడిన కర్మముయొక్క ఫలము తదన్యున కెట్లు సంప్రాప్తమగునెడి యీ యుక్తి యెందులకు రానేరదు ? శత్రుదేశము సేనచేఁ గెలువఁబడినది. ఈ కారణము చేత నీ రాజ్యము సేనలోని భటులందఱును బంచుకొనవలయును గదా! ఇంకను రాజు దమ భోజనమునకును, శస్త్రాస్త్రముల కును వ్యయపరచిన ద్రవ్యమును వడ్డీతోగూడ నొసఁగవలసి యుండును సాంఖ్యశాస్త్రమందలి సిద్ధాంత మిట్లున్నది:

'ప్రకృతి వాస్తవేచ పురుషస్యాద్యా ససిద్ధిః' యని యున్నది. సాం॥ ౨॥ ౫॥

ప్రకృతిప్రపంచమును రచించుచున్నది. కాని ప్రపంచము పురు
షుని సృష్టించుచున్నది. ఒకరు పనిచేయుదురు. మఱియొకరికిఁ
జేరువచ్చును. పాణిని "అష్టాధ్యాయీ" యను గ్రంధమును
రచించెను. ఫలము దానిని బఠించెడివాని కగును. పరమేశ్వ
రుఁడు వేదజ్ఞానము ప్రపంచముకొఱకొసంగెను. వేదజ్ఞానమొసం
గిన పరమేశ్వరున కెట్టి ఫలముగూడ లేదు, ఆ వేదవిధులను
జేసినట్టి ప్రపంచములోని మనుష్యులకు మోక్షఫలము గలుగును.
స్వామి దయానందులవారు సత్యార్థప్రకాశములో నొక స్త్రీకిఁ
బదునొకండుగురు భర్తలని వ్రాసియున్నారు. వ్రాసినవారు
స్వామి దయానందులవారు. ఆవిధి సత్యార్థప్రకాశము నమ్మెడి
స్త్రీ లొనర్పవలసియుండును. వ్రాయున దొకరు. చేయునది
మఱియొకరు. స్వర్గీయ దయానందస్వామివారు ౧౧ పదునొ
కండుగురు భర్తలను స్త్రీలకు జేయవలసినదని వ్రాసియున్నారు
కాన ముందుగా శ్రీస్వామివారే చేసికొందురుగాక యను స్త్రీ
లనకుండున ట్లనుగ్రహించుగాక!

దీనింబట్టి యొకరు చేసిన కర్మముయొక్క ఫలమును
మఱియొకరికి జెందితీరుననెడి సంగతి ధ్రువమైనది, మఱియుఁ
గనుఁడు, వేదముగూడ నిట్లే జెప్పినది. పశువులకు రోగము
వచ్చినప్పుడీ క్రింది మంత్రముతో వేదజ్ఞుండగు బ్రాహ్మణుఁడు
యజ్ఞ మొనర్పవలయును. అమంత్రమిది.

'ఇమా రుద్రాయ తపసేకపర్దినే, క్షయద్వీరాయప్రభరా
మహే మతిః। యథా సమసద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం
గ్రామే అస్మిన్ననాతురం॥ యజు॥౧౬॥౪౮

ఈ మంత్రముతో బ్రాహ్మణుఁడు యజ్ఞము గావించిన యెడలఁ బశువుల రోగము ధ్వంసమగును. ఇందన్యకృత కర్మఫలము తదన్య ప్రాణికి సంక్రమింపలేదా ? యేమి! ఒండు రెండు లౌకిక ములగు నుదాహరణముల నిచ్చెదను. విచారించుకొనుఁడు. లాల్ మురళీధరుఁడనువాఁడు వ్యభిచరించెను. ఇతనికిఁ జుఱుకు రోగము తగిలినది. ఆరోగ మంటుకొనిన వెంటనే మురళీధరుఁడు యమున కతిథి యయ్యెను. తరువాత వాని కొక కొడుకు పుట్టెను. అతఁడు పుట్టుటతోడనే చుఱుకురోగము గలవాఁ డయ్యెను. సౌఖ్య మనుభవించున దొకరు. తత్కర్మఫలమనుభ వించునది మరియొకరు.

ఇట్లే సేట్ ఝుంఝూవ ల్లనువాఁ డొకడు గలఁడు. వాఁడు పిసినిగొట్టు. ఆరేడు లక్షల కధిపతియై యున్నాఁడు. కాని వానికి సోదరుఁడుగాని సుతుఁడుగాని లేఁడు. ఇతఁడు కాల వశమున మరణించెను. ఇతని యాస్తియంతయు హీరాలాలను నొక చుట్టమునకుఁ జిక్కెను. మిద్దెలు మేడలు నిర్మింపఁబడెను. మోటారులు రప్పింపఁబడెను. రత్నములు చెక్కిన బంగరు నగలు చేయింపఁబడెను. బిచ్చమెత్తుకొనెడి హీరాలా లనెడి వాఁడొక గొప్పశ్రీమంతుఁడై యిచ్చవచ్చినట్లు పూర్తిగా వ్యయ పరుపఁ దొడఁగెను. ఆర్జించువాఁ డొకఁడు. అనుభవించునది మఱియొకఁడు. చలికాలమం దొకనాఁడొక చెట్టునీడను చర్ఝూ రాంజీ యనువా రెండలోఁ దిరిగివచ్చి కూరుచుండి నూనెను రాచుకొనుచుండెను. ఇతఁడు తానప్పుడే యంగడివాడ(బజారు) నుండి నాలుగు పైసలు పెట్టికొను గోలుచేసి తీసికొనివచ్చిన

యొక రెండణాల వెలగల పెరుగు గల దొన్నెను దన దగ్గరనే యుంచుకొనియుండెను. ఈ మహాత్ముఁడు నూనెను రుద్దు కొనుచు నొకమిత్రునితో సంభాషణము గూడఁ జేయుచుండెను మాటలలోఁబడిన యితనిని జూచి యొక కాకి వ్రాలివచ్చి యా పెరుగులోనుండి తన ముక్కునిండ పెరుగును గైకొనిపోయెను. ఈస్థితిని జూచి చర్ఘూరాంగారు పశ్చాత్తాపపడి క్రుద్ధుఁడై మన స్సులో బాగుగా యోజించి దీని ప్రాణములఁ దీసెదనని నిశ్చ యించి యుండెను. కొలఁదితడవైనమీఁద నతఁడు చేతిలో జాతిని దాచిపెట్టుకొని మాటలాడెడి సమయమందుఁ గాకి తిరిగివచ్చెను. ఆకాకిని జూచిన వెంటనే యీ చర్ఘూరాంగారు తన చేతిలోని జాతితో మిక్కిలి బలముగా నాకాకిని గొట్టెను. (మనుష్యులలో మంగలివాఁడును బక్షులలోఁ గాకియును మంచి నేర్పుతో నుండునని చెప్పుదురు.) కాని తన జాగ్రత్తతో నాజాతిదెబ్బనా దప్పించుకొనెను. కాని యీ జాతిదెబ్బ యెదురుగా వచ్చెడి పోలూరాంబాబుగారి కన్నులలోఁ జాలతీవ్ర ముగాఁ గుడికన్ను పాడయిపోవునట్లు దగిలెను. ఇప్పుడీబాబు గారిని 'అయ్యా! ఒకఁడు చేసిన కర్మముయొక్క ఫలము మఱి యొకఁడనుభవించునా? లేదా? యని యడుగుఁడు. పాషాణ మును విసరికొట్టినవారు ఛర్ఘూరాంగారు. దానివలన నొకకం టిని బోగొట్టుకొన్నవారు పోలూరాంబాబుగారు. ప్రపంచములో నొకండు చేసిన కర్మయొక్క ఫలము మఱియొకఁడు పొందుచు న్నప్పుడు తిరిగి దానిం గురించి శంకించుట యెందులకు?

ఈనాఁడానాఁటి సమయము జ్ఞాపకమునకు వచ్చుచున్నది అదేదన, చిత్రకూటపర్వతమును జేరి భరతుఁడు శ్రీరామచంద్ర మూర్తితోఁ దండ్రి స్వర్గవాసియయ్యెనని చెప్పెను. ఈమాటను విని శ్రీరామచంద్రప్రభువు దుఃఖించి సీతాదేవితో 'నీకు మామ గారు లేరనియు లక్ష్మణునితో 'లక్ష్మణా! నీవు పితృహీనుఁడ వైతి వనియుఁ జెప్పి యింక నిట్లు పలికెను.

'ఆనయేంగుదిపిణ్యాకం, చీరమాహరచోత్తరం
జలక్రియార్థం తాతస్య, గమిష్యామి మహాత్మనః॥

లక్ష్మణా! నీవొక యంగవస్త్రమును దీసికొని గారపండు రేగుపండు పిణ్యాకమును (తెలికెపిండి) గొనిరమ్ము. నేను మహా త్ముఁడగు తండ్రిగారికి జలక్రియచేయుట కొఱకు నది కేగెదను.

శ్రీరామచంద్రప్రభు వుత్తరీయము నొసంగి నదికిఁ బోయి స్నాన మొనర్చెను.

'ప్రగృహ్యాతు మహీపాలో, జలపూరిత మంజలిం
దిశం యామ్యమభిముఖో రుదన్వచన మబ్రవీత్॥
ఏతత్తే రాజశార్దూల విమలం తోయ మక్షయం
పితృలోక గతస్యాద్య మద్దత్త ముపతిష్ఠతు॥

శ్రీరామచంద్రుఁడు దక్షిణదిక్కుగా మొగముపెట్టి కూర్చుండి దోసిలినిండ జలమును గైకొని యేడ్చుచు ఓ రాజశార్దూల ! పితృలోకమున కేగియున్న నీకు నేనిచ్చెడి యీదోసిలి శుద్ధజల మక్షయమై చెందుగాక యని వచించెను. తర్పణము చేసి

తరువాత శ్రీరాముఁడు తిరిగి స్వస్థానమునకు (బస) జనుదెంచెను. లక్ష్మణుఁడును రేగుపండ్లు, గారపండ్లు, దెలికెపిండిని దీసికొనిఁ వచ్చెను. అంత శ్రీరాముఁడు శ్రాద్ధ మొనర్చెను. తండ్రికి భోజనము నివేదించుచు నిట్లు చెప్పెను.

> 'ఐంగు దం బదరై ర్మిశ్రం, పిణ్యాకం దర్భసం స్తరే
> న్యస్య రామ స్సు దుఃఖార్తో రుదన్వచన మబ్రవీత్॥
> ఇదం భుంక్ష్వ మహారాజ! ప్రీతో య దశనావయం
> యదన్నః పురుషోభవతి, తదన్నా త్తస్య దేవతాః॥

రేగుపండ్లు గారపండ్లతోఁ గూడిన తెలికెపిండితోఁ జేయఁబడిన పిండమును దర్భలపై నుంచి దుఃఖితుఁడై కన్నీరుమున్నీరుగా గాఱుచుండ శ్రీరాముఁ డిట్లనెను. ఓమహారాజా! ఇద్దానినె మీరు భుజింపుఁడు. ఎందులకనఁగా, పురుషుఁ డేయన్నమును దినునో యాయన్నమునే దేవతలకు సమర్పింపవలసిన దని వేదమందు జెప్పఁబడినది. ప్రస్తుతమున నేనీయన్నమునే తినుచున్నాను ఇందువలననే మీకీయన్నము నిడుచున్నాను.

పరమేశ్వరుఁడు వేదధర్మమర్యాదను జూపుటకొఱకు రామస్వరూపమును దాల్చి మృతుఁడగు పితయొక్క శ్రాద్ధతర్పణములలోఁ నీమర్యాదను జేసి చూపియుండెను. ఇంకను యూరోపియ సభ్యత వలనఁ జెడిపోయిన చిత్తవృత్తులు గల యిప్పటి హిందువులు పిల్లవాఁడు చేయు శ్రాద్ధముయొక్క ఫలము తండ్రికెట్లు సంక్రమించునని వాదించెదరు. భళీ! భళీ!

గారెలు బూరెలు మున్నగునవికూడఁ పితరులకుఁ జేరునా!

(౨) ఇంకను గొందఱు మహాశయులు శ్రాద్ధములోఁ బెట్టెడి పూరీలు' గారెలు, బూరెలు, లోనగునవి చచ్చిన పితరుల కెట్లు చేరునని ప్రశ్నింతురు.

ప్రత్యుత్తరము. శరీరము విడిచిపెట్టిన తరువాత ఆత్మకు 3గతులు గలుగును. పాపము, పుణ్యము లనెడి రెండువిధములుగా నుండెడి కర్మములు నాశనమై కేవలము శుద్ధము పవిత్రమును ప్రకాశస్వరూపమునగు ఆత్మను సజాతీయమగు ప్రకాశపుంజము గల సూర్యుఁ డాకర్షించును. ఈయాత్మ, సూర్యుని కిరణముల వలన నాకర్షింపఁబడి సూర్యమండలమును భేదించుకొనుచు మోక్షపదమునకుఁ బోవును. దీనికి శ్రాద్ధమొనర్పవలసిన యవసరము లేదు. కాని మన పితరు లెవరు మోక్షము బొందిరో యది తెలిసికొనెడి జ్ఞానము మనకు లేదు. ఇందువలన శ్రాద్ధమాచరింపఁబడుచున్నది. ఇట్టిస్థితిలో శ్రాద్ధఫలము శ్రాద్ధకర్తకే చెందఁగలదు. ఇది మొదటి సమాధానము.

ఎవనికిఁ బుణ్యకర్మము లెక్కువగానుండి పాపకర్మములు తక్కువగానుండునో యట్టి పితరులు మానసిక శక్తిని ప్రాధాన్యముగాఁ జేసికొని యుందురు. వారిని వారి సజాతీయ చంద్రుఁడు తన కిరణములనుండి యాకర్షించును. వీరు చంద్రమండలమును భేదించుకొనుచుఁ జంద్రుని కంటెఁ బైనున్న పితృలోకమునకుఁ జేరెదరు. శ్రాద్ధమందీ పితరులనే యాహ్వానింప

వలయునని వేదము చెప్పుచున్నది. దేవతల కెన్నిశక్తులు గలవో యాసమస్తశక్తులును నీపితరులకును గలవు. పితరులు తమ యలౌకిక శక్తిచే వచ్చుచున్నారు. వీరు బ్రాహ్మణులతోఁగూడ నాసీనులై శ్రాద్ధాన్నమందలి సూక్ష్మాంశమును మధుమక్షికములు పూలపైఁగూరుచుండి తమశక్తితోఁ బూలకేవిధమగు వికారము గల్గింపకుండ రసమును బీల్చుకొని పోయినట్లు గ్రోలి పోవుచుందురు. ఇది రెండవ సమాధానము.

ఏయాత్మలకుఁబాపమే యతిశయముగా నుండునో యవ్వి యమునిచెంతఁ బ్రపంచములో నేదోయొక యోనికిఁ బంపఁబడును. వెండియుఁ బితృలోకమునుండి తిరిగివచ్చిన పితరులుగూడ నేదోయొక యోనికిఁ బోవుచుందురు. వీరలకు శ్రాద్ధఫలము వీరు నివసించియున్న యోనులకే చెందుచుండును. ఎట్లు చెందుననెడి విషయమునుగూర్చి దేవలస్మృతి యిట్లు చెప్పుచున్నది:

"దేవోయదిపితాజాతః, శుభకర్మానుయోగతః
తస్యాన్నమమృతంభూత్వా, దేవత్వేఽప్యనుగచ్ఛతి॥
గంధర్వేభోగరూపేణ, పశుత్వేచతృణంభవేత్
శ్రాద్ధాన్నం వాయురూపేణ, నాగత్వేఽప్యనుగచ్ఛతి॥
పానంభవతి యక్షత్వే, రాక్షసత్వేయథామిషం
దనుజత్వే తథామద్యం, ప్రేతత్వేరుధిరోదకం॥
మనుష్యత్వేఽన్నపానాదినానాభోగకరంభవేత్॥"

తన శుభకర్మములచేతఁ దండ్రి దేవయోనియందు జన్మిం చినయెడల నీశ్రాద్ధమందిడిన భోజనాదుల ఫల మమృతరూపమై యతనికిఁ జెందగలదు. గంధర్వయోనియందుఁ బుట్టినచో భోగ రూపముగాఁజేరును. పశుయోనియందుఁ బుట్టిన యెడలఁ దృణ రూపముగాఁ బొందును. సర్పముగా జన్మించినయెడల శ్రాద్ధా న్నము వాయు రూపమై యతనికి సంక్రమించును. యక్షయోని యందుఁ బానరూపముగాను, రాక్షస యోనియందు మాంస రూపముగాను దనుజయోనియందు మద్యరూపముగాను, ప్రేత యోనియందు రుధిర (నెత్తురు) రూపముగాను, జలరూపము గాను, మనుష్యయోనియందన్నోదకాదిరూపముగాను యీరీతి గానింకను శ్రాద్ధాన్నము పెక్కురూపములుగా యోని ననుస రించి భోగమై పితరులకుఁ జెందుచుండును. ఇది మూడవది.

బాపల పొట్ట జాబుల పెట్టెయా?

(3) మఱికొందఱు మహానుభావులు బాపలపొట్ట, యిట వేసినదానిని నచటి పితరుల కందఁజేయు జాబుల పెట్టెయా యని కూడ నడిగెదరు.

ప్రత్యుత్తరము. మీప్రశ్న దివ్యపితరులంగూర్చిన విషయ మందు నిలువఁజాలదు. ఎందులకనఁగా ఈ పితరులన్ననో తమరే స్వయముగా వచ్చి శ్రాద్ధాన్నమును భుజింతురు. ఆ! ఆ! కాని యోన్యంతరమందుఁ బ్రవేశించియున్న పితరులం గూర్చి పైప్రశ్న సరిపడగలదు. బాపల పొట్ట జాబుల పెట్టె గాదు. కాని ఉప కార్యాలయ (సబ్ పోష్టాఫీస్) మై యున్నదని నిరూపించెదను.

దృష్టాంతరూపముగా నిది బోధింపఁబడును. సావధానముగా ముందు చదువుఁడు.

ఒకనాఁడు నిరంతరవితండవాదిగారు వందరూపాయలు తంత్రీద్వారమున (టెలిగ్రాంద్వారా) బంపుటకై తనయూరి లోని సబ్ ఆఫీసుకువచ్చి పోష్టుమాష్టరుగారిని 'అయ్యా! నూరు రూపాయలు టెలిగ్రాం మనియార్డరు చేయవలసినదని కోరెను. పోష్టుమాష్టరుగారా రూపాయలను టెలిగ్రాం కయ్యెడి భృతి (ఫీజు) యు లెక్కపెట్టితీసికొని యెదుట నుంచుకొని ఫార (పత్ర) మేదియని యామహాత్మ్మ నడిగెను. ఆతఁడు వ్రాయబ డిన యొక కాగితము నామాష్టరుగారి కిచ్చెను. ఈకాగితము నందీవందరూపాయలు గిరిధరలాల్ షరాఫ్,కల్బాదేవిరోడ్ బొం బాయి యను విలాసము గలవారికిఁ జేరవలసినదిగా వ్రాయఁ బడియుండెను. మాష్టరుగారు నాకాగితమును గూడ దన ముం దర నుంచుకొని తంత్రి (టెలిగ్రాం) కడకుఁ జని దానిపైఁ జేతి నుంచి మైదాఱు నిమేషములవఱకు 'కడకట్ట, కట్టకడ, కడకడ' యని శబ్దించునట్లు కొట్టెను. తరువాత మాస్టరు దీనినుండి తీరిక చిక్కుటతోడనే యొకకాగితముపై నేదియో వ్రాసి భటునితో దీనిపై ముద్రను గొట్టి యీకాగిత మీతనికిచ్చివేయు మని చెప్పెను. ఈ మాట విని యతఁడు వ్యాకులపడి యామాష్టరు గారితో 'అయ్యా! నారూపాయలు ముట్టెనవా? యని యనెను. దానికతఁడు ముట్టెనవని ప్రత్యుత్తర మిచ్చెను. ఇది విని యా మహాత్మ్మునకుఁ గోపము వచ్చి యతఁడు నారూపాయలన్నను

యావత్తు ఈబల్లమీదనే యున్నవి. అందినవేమిటి? మట్టియా? యని యడిగెను. దీనిని విని మాస్టరుగారి రూపాయలిచటనే యుండును. బొంబాయి పోష్టుమాస్టరుగారా షరాఫ్ గిరిధర లాలుగారికా రూపాయలు ముట్టఁజేయును.

అని యతనికిఁ జెప్పెను. ఈ మహాశయులదిగాదు. తమరు నన్ను మోసగించుచున్నారు. నారూపాయలను మీరే మ్రింగివేయుచున్నారు. ఈ రూపాయలనే బొంబాయికిఁ జేర్పుఁడనిచెప్పెను. పోష్టుమాస్టరుగారు పెక్కుమారులు సమాధాన పరచెను. కాని యామహాత్ముఁడొకమాట గూడ వినలేదు. చిట్టచివరకు మాస్టరునకు గూడ నాగ్రహామువచ్చి యితనిని నెట్టివేయుఁడని భటున కాతఁడాజ్ఞాపించి పోయెను. భటుఁడు వెంటనే యతని యాజ్ఞను నెరవేర్చెను. చేయునదేమియు లేక యామహాత్ముఁడా భటునివలన నాలుగైదు గ్రుద్దులను జెంప కాయలను దిని స్వగృహామునకుఁ జేరుకొనెను. తంత్రీధనాజ్ఞ (టెలిగ్రాం మనిఆర్డర్) లో నిచటిరూపాయలిచటనే యుంచఁ బడి యుద్దేశింపఁబడిన స్థలమందు రూపాయలు దీసికొనువారికి వేఱురూపాయలందఁజేయునట్లు శ్రాద్ధాన్నముగూడ నందఁజేయు చుండును. కాఁబట్టి బాపలపొట్ట జాబులపెట్టెకాక యవియందఁ జేసెడి టెలిగ్రాం సబ్ ఆఫీస్ అని యెఱుంగుఁడురుగాక.

శ్రాద్ధసమయమందు నేలపైఁ జాలకుశలుపరచి వాని మీద యవలపిండి తోడనో బియ్యపుపిండితోడనో చేయఁబడిన పిండ మిడఁబడుచున్నది. పిండములపై యవలును, దిలలును, పాలును తేనెయుఁ జేర్పఁబడుచున్నవి. అటిపట్టున శ్రాద్ధకర్త,

యీశ్వరస్వరూపమును ధ్యానించును. మఱియు యాజ్ఞికుఁడు "అర్యమణం" యీమున్నగు మంత్రములు నుచ్చరించుచుండును. ఇఁక నిప్పుడు దాని తత్వమును దెలిసికొనుము. బియ్యమునందును, యవలయందును జల్లని విద్యుచ్ఛక్తియుఁ దిలలయందును పాలయందును వెచ్చని విద్యుచ్ఛక్తియు నుండును. సామాన్య మనుష్యుఁడు మాటలాడు సమయమందాతని శరీరమందుఁ గొంచెముగా విద్యుచ్ఛక్తి పుట్టుచుండును. కాని యాజ్ఞికుఁడేదో యొక వేదమంత్రమును స్వచ్ఛముగా సస్వరముగా నుచ్చరించు సమయమందు నాభిచక్రమునుండి వాయువు బయలువెడలి మనుష్యుని శరీరములో వెచ్చని విద్యుచ్ఛక్తిని బుట్టించుచు విద్యుత్తును శరీరమునుండి వెలుపలకుఁ ద్రోసివేయును. శబ్దమువలన బ్రాహ్మణుని శరీరమునుండి యలౌకికమగు వైదిక క్రియచే సిద్ధించిన విద్యుచ్ఛక్తియుఁగూడఁ బిండములు మీఁదికి సంక్రమించెను. కావున నీ విద్యుచ్ఛక్తియు, తిలలయందుండు విద్యుచ్ఛక్తియు నీ రెండును వెచ్చనివై యున్నవి.

సర్వవిధములనుండు విద్యుచ్ఛక్తులను గలిపివేయుటయే తేనెయొక్క ధర్మము. ఈ సిద్ధాంతము ననుసరించి యవలు, తండులములు, పాలు, తిలలును మఱియు శబ్దము ననెడి యీ యైదు తెఱఁగుల నుండెడి విద్యుచ్ఛక్తులు తేనెచేఁ గలిపివేయఁబడి యొకటిగాఁ జేయఁబడెను. కుశలు పఱచుటకుఁ గతమేమనగా, పుట్టినట్టి విద్యుచ్ఛక్తులు భూమిలోఁ బ్రవేశింపఁ గూడదనెడిదియే. కఱ్ఱయు విద్యుచ్ఛక్తిని ప్రవేశింపనీయక యడ్డగించును. తేనె గలియుటచేఁ బుట్టిన యలౌకిక విద్యుచ్ఛక్తి, శ్రాద్ధ

కర్తయొక్క మానసిక శక్తిద్వారమున నతని మనస్సు సంచరించెడి వైపునఁ బోవుచుండును. అతని మనస్సు పరమేశ్వరధ్యానము నందుఁ బెట్టఁబడి యున్నది. ఈకారణమునుబట్టి యీ విద్యుచ్ఛక్తి బయలుదేరి యీశ్వరునిఁ దాకెను. సర్వజ్ఞుఁడైన గారణమునఁ బరమేశ్వరునకు నేఁడు పండిత రామనాధశాస్త్రి రను వారు తన తండ్రియగు సోమనాథశర్మకు శ్రాద్ధాన్నమును బంపుచున్నాఁడనియు, సోమనాధశర్మ యిప్పుడా (ఫలాని) యోని యందుఁ బుట్టియున్నాఁడనియుఁ దెలిసియున్నది. అందువలనఁ బరమేశ్వరుఁ డా శ్రాద్ధాన్న మవ్వానికిఁ దగిన యాహారముగా మార్చివేసి యక్కడికే పంపివేసెను. ఇది శ్రాద్ధాన్నము నందఁ జేసెడి ప్రకారము. అందువలనఁ బాపలపొట్ట జాబులపెట్టె (లెటరుబాక్సు) గాక ఉపకార్యాలయము (సబ్ పోష్టు ఆఫీసు) అని చెప్పుచున్నాను.

శ్రాద్ధమునకు రశీదు ఇచ్చెదరా?

(౮) కొందఱు మహాశయులు శ్రాద్ధము చెందును శ్రాద్ధము చెందునని మాటిమాటికి సనాతనధర్మీయులు వాపోయెదరు. శ్రాద్ధమునకేమైన రశీదు (ప్రత్యుత్తర పత్రము)గూడ నిత్తురా? శ్రాద్ధ మందఁజేసినట్లు రశీ దెంతవఱ కొసంగరో యంతవఱకా శ్రాద్ధాన్నము పితరుల కందిన దని మేమెట్లు నమ్మవలెనని యడుగుచుందురు. అడుగనిండు.

సత్పురుషు లెల్లరు మంచిమంచి పనులఁ జేయుచుందురనియు, ప్రపంచమున కుపకారము చెసినయెడల రాబోవు జన్మ

మనందు సుఖము శాంతియును గల్గు ననియు జెప్పుచుందురు. మంచిపనులు చేసినందువలన సుఖమును శాంతియును గల్గును. ఈపనులకు ప్రపంచమందలి జనులకు రసీదేదైన వచ్చుచున్నదా! మనుష్యుఁడు చచ్చిపోవునప్పుడు వాని గృహము, వాని దానము గూడ నిచ్చటనేయుండును. వాఁడు చేసిన యుపకారము లన్నియు నిందే నిల్చిపోవును.

చచ్చినట్టి మనుష్యునితో గూడ నొక యొంటె గాని యొక గుఱ్ఱముగాని యొక కంచరగాడిదగాని యొక యెద్దులబండిగాని యొక పదియో యైదో డబ్బాలుగల సామానుబండిగాని పోవుటలేదు. ఆ శుభాశుభకర్మములు మనుష్యుని దగ్గిరకెట్లు చేరఁగలవు? ఏమి! దీని కేదైన రసీదు చిక్కుచున్నదా ? మీ కర్మములకే మీకు రసీదు దొరకనప్పుడింకఁ బ్రతినిధివలనఁ జేయింపఁబడిన కర్మమునకు రశీదెట్లు చిక్కఁగలదు ? మీరు రశీదులేకుండ శుభాశుభ కర్మఫలమును నొప్పుకొనుచున్నప్పుడే స్వత్వము (హక్కు) ను ముందుంచి శ్రాద్ధమునకు రశీదడుగుచున్నారో దీనిజాడగనిపెట్టి చెప్పుడు. కర్మఫల సంగతి యన్న ప్రత్యేకవిషయము. కాఁబట్టి యిది యిట్లుండనిండు.

మీరేరూపాయల నిగ్లండు (పాశ్చాత్య) దేశమునకుఁ బంపెదరో యాయింగ్లండున వానిని గైకొనిన వారి చేతి రశీదు మీకు దొరకుచున్నదా ? ఏమి ? ఇటనుండి యేరూపాయల నింగ్లండు దేశమునకుఁ బంపుచున్నారో యవి బొంబాయికిఁజేరి రూపాయల రూపకముగానుండక పౌండు, షిల్లింగు, పెన్సుల

రూపముగామారి యింగ్లండునకుఁ బోవుచున్నవి. ఆదేశములో మన భారత దేశములోవలె మనియార్డరు ఫారము చేతఁబట్టు కొని యింటింటికిఁ దిరుగరు. కాని రూపాయలను దీసికొనెడి వారికిఁ దెలియఁజేయుదురు. వారు వచ్చి యామనియార్డరును తీసికొనిపోవుదురు. ఆరూపాయలను దీసికొనెడివారిచేతి రశీ దెట్టిదిగూడ రూపాయలఁ బంపిన వారికిఁ జిక్కుటలేదు. ఇఁక నీమనియార్డరువలెఁ గర్మకు రశీదు దొరకకపోయినయెడల నన్యా యమేమి గలదు? ఏమియులేదు. మీరింగ్లండునకుఁ బంపించిన రూపాయలకు రశీదుగోరనియెడల నిఁక శ్రాద్ధమునకు రసీదడు గుట కధికారము మీకెటనుండి వచ్చినది? కొంచె మిద్దాని జాడఁగూడఁ దెలుపుఁడు.

మీరు రసీదే కావలయునని పట్టుబట్టిన యెడల నేను రసీదును జూపెదను. కాని యీప్రతివాది రసీదును గైకొనియు శ్రాద్ధము విహితమనెడి సంగతిని నొప్పుకొనఁడని నా విశ్వాసము. ఇచ్చటఁబితరుల సుఖముకొఱకుఁ జేసినదానము యొక్క ఫలము పితరులకు ముట్టుచున్నది. ముట్టినది. ఇద్దానికి "దేవోయదిపితాజాతః" యీ మున్నగు ధర్మశాస్త్రవచనము లును "యేనిఖాతాయేపరోప్తా" యీ లోనగు మంత్రములును రసీదులై యున్నవి. వేదము మీరు చేసినదానము పితరులకు ముట్టుచున్నదని చెప్పునప్పుడు తిరిగి యింతకంటె విలువగల రసీ దేదియుండును ? ఈశ్వరుని దగ్గరనుండి రసీదు చిక్కినప్పుడు మరలనింకెట్టిరసీదుగోరుచున్నారు ? ఈశ్వరుని రసీదు బూటక మైనదందురా ? వాహ్వా! వేదముయొక్క రసీదు నమ్మగూడ

దట! బూటకమట! ఇట్లనుట వారి నాస్తికతను బట్టబయలుచేసి కొనుటయే యగును.

శ్రాద్ధ మెనిమిదణాలడబ్బుతోఁగూడ నెరవేర్పవచ్చును. ఆకోలది డబ్బును దక్కించుకొనుటకై యెంతమోసము ! ఎంత యసత్యకల్పనము ! ఎంత వితండవాద మొనర్చుట ! ఎంత నాస్తికతను జూపుట ! వేదములు నాశన మగుగాక ! ధర్మ శాస్త్రములు రూపుమాయుగాక ! పురాణములు బూదియగు గాక. ఏది యెట్లైన నగుగాక. మా యెనిమిదణాలడబ్బు మిగులుటయే మాకు పరమార్థ మని వారి యభిప్రాయమై యున్నది. ఇట్టిమనుష్యుఁ డెట్టుల ధార్మికశ్రేణియందుఁ బ్రవేశింపఁ గలఁడు? 'టకాధర్మో టకాకర్మ, టకాచ పరమం పదం' అని మాలను ద్రిప్పుచు జపించెడి మనుష్యుఁ డొక మనుష్యుఁడా?

### శ్రాద్ధాన్న మింటిలోవా రేల భుజింపకూడదు?

(౨) పితరుల నిమిత్తము జరిపెడి శ్రాద్ధములో నిడెడి యన్నాదుల నెందులకు బ్రాహ్మణులకే పెట్టవలెను? ఇంటిలోని యిల్లాలు, పిల్లలు, మున్నగువారి కాయన్నము బెట్టి పితరుల నెందులకుఁ దృప్తి పఱుపఁగూడ దని మఱికొందఱు ప్రశ్నించు చున్నారు.

ప్రత్యుత్తరము. తంతిని (టెలిగ్రాం) నీవు తంతి గొట్టెడి టెలిగ్రాంమాస్టరుగారికే యెందుల కిచ్చెదవు? యింకొక హయాణ భాషనభ్యసించిన పురుషున కెందుల కొసంగవు ? అని మనము ప్రశ్నించినప్పుడు తంతి యిచ్చుట లేదని ప్రత్యుత్తరము వచ్చును.

ఇదే శ్రాద్ధమునుగూర్చి వేసిన పై ప్రశ్నమునకు త్తరము. బ్రాహ్మ ణులయొద్ద శ్రాద్ధాన్నము నందఁజేసెడి శక్తి యున్నది. ఇతరుల యొద్ద లేదు. దీనినే మనువిట్లు నుడువుచున్నాఁడు.

'యస్యాస్యేన సదాశ్నంతి, హవ్యాని త్రిదివౌకసః।
కవ్యానిచైవ పితరః, కిం భూత మధికం తతః॥

మను॥అ౧॥౯౫శ్లో

ఎవని ముఖమువలన దేవత లెల్లప్పుడు హవ్యములను భుజించు చుండిరో మఱియు గవ్యములను బితరులు భుజించుచుండిరో యింతకంటె నధికమైన శక్తి యింకొకటి యేది గలదు ? ఈశక్తి బ్రాహ్మణులయందే యున్నది. దీనింగూర్చి వేదమంత్ర మిట్లున్నది.

"ఇమమోదనం నిదధే బ్రాహ్మణేషు, నిష్టారిణం లోకజితం స్వర్గం సమేనూ తేష్టస్వధయాపిన్వమానో విశ్వరూపా ధేనుః కామదుఘామే అస్తు॥ అథర్వ॥ ४॥ ३४॥ ८

ఈ యన్నమును నేను బ్రాహ్మణుల యెదుట లేక బ్రాహ్మణులకు బెట్టుచున్నాను. అదివిస్తృతమును లోక జిత మును, స్వర్గమునకుఁ జేర్చునదియైయున్నది. జలమువలన వృద్ధి బొందిన యీయన్నము నాకనంత పుణ్యమొసంగి కామధేనువు వలె నాకోరికలన్నియు ఫలించునట్లు చేయుగాక. వేదమందలి రెండవ ప్రమాణముగూడఁ జూడుడు.

"యంబ్రాహ్మణేనిదధేయంచవిక్షు, యావిప్రుష ఓదనా నామజస్యసర్వంతదగ్నే సుకృతస్యలోకే, జానీతాన్నస్సంగమనే పథీనాం" అథర్వ॥౯॥౫॥౧౯

ఓ అగ్ని ! బ్రాహ్మణులకేను వడ్డించియున్న భోజనము సక్రమముగా విభాగింపబడియున్నది. దానిం జేయుటయందు వ్యాపించిన బిందువులను యావత్తుగై కొని స్వర్గలోకమునకుం బోయి నాపితరు లెవరెవరో వెదకి వెదకి బాగుగాఁ దెలిసికొని వారికిమ్ము. మార్గమునందు జాగ్రత్తగా నడచిపొమ్ము. ఈ పైదానింబట్టి శ్రాద్ధాన్నమితరబ్రాహ్మణులకే పెట్టవలయుననియు అప్పుడే పితరులు తృప్తిజెందుదురనియు గ్రహింపగలిగితిమి.

శ్రాద్ధము మూడుతరములవారికే యేల చేయవలెను?

(౬) మరికొందఱు మహాశయులు 'పండితవరా! మీరు శ్రాద్ధమును మూడుతరములవారికే యెందులకుఁ జేసెదరని ప్రశ్నించెదరు.

ప్రత్యుత్తరము. తండ్రిని వసుస్వరూపునిగాను, తాతను రుద్రస్వరూపునిగాను, ముత్తాతను ఆదిస్వరూపునిగాను వచించి యున్నందువలన మూడుతరములవారికే శ్రాద్ధమొనర్చుచున్నాము. ఇప్పుడు శ్రాద్ధకర్త, మరణించెనని యనుకొనుఁడు. అత్తటి నతఁడు వసుస్వరూపుఁడగుచున్నాఁడు. వసుస్వరూపుఁడుగా నిది వరకుండిన శ్రాద్ధకర్తయొక్క తండ్రి రుద్రస్వరూపుఁ డగుచు న్నాఁడు. రుద్రస్వరూపుడుగ నుండిన శ్రాద్ధకర్తయొక్క తాత ఆదిత్యస్వరూపుఁడగుచున్నాఁడు. ఆదిత్యస్వరూపుఁడుగా నున్న శ్రాద్ధకర్తయొక్క ముత్తాత మోక్షమును బొందెను. 'ఆదిత్యాంశ మాసాద్య, పునరాగమనం కుతః' ఆదిత్యస్వరూపమును బొందిన తరువాత నతనికిఁ దిరిగి వచ్చుట యెక్కడిది?? అనఁగా ఆదిత్యస్వ

రూపమును బొందినవాఁడు మోక్షమును బొందును. కాని తిరిగి రాఁడు. కాఁబట్టి యతనికి శ్రాద్ధమొనర్పవలసిన యావశ్యకత యెట్టిదియు లేదు. దీనినే మనువిట్లు వ్రాయుచున్నాఁడు.

పుత్రేణ లోకాన్ జయతి, పౌత్రేణానన్త్యమశ్నుతే-
అథ పుత్రస్య పౌత్రేణ, బుధ్నస్యాప్నోతి విష్టపం॥

మను॥౯॥౧౩౭

పుత్రునివలన మనుజుఁడు స్వర్గమును బొందును. పౌత్రుని వలన స్వర్గములోని భోగముల ననుభవించును. పౌత్రుని (ముని మనుమని) వలన నాదిత్యలోకమును బొందును. మఱియు వేద మిట్లు చెప్పుచున్నది.

పునన్తు మా పితరస్సోమ్యాసః పునన్తు మా పితామహాః
పునన్తు ప్రపితామహాః పవిత్రేణ శతాయుషా॥
పునన్తు మా ప్రపితామహాః పునన్తు ప్రపితామహాః
పవిత్రేణ శతాయుషా విశ్వమాయుర్వ్యశ్నవై॥

యజు॥౧౯।౩౭

సోమయోగ్యుఁడగు తండ్రి పూర్ణాయుపు నొసంగు పవిత్రముతో నన్ను బరిశుద్ధునిఁ జేయుగాక! తాతయు నన్ను బవిత్రుని జేయుగాక! ముత్తాతయు నన్ను బవిత్రునిఁ జేయుగాక. పితామహుఁడు శతాయువు నొసంగు పవిత్రముతో నన్ను బరిశుద్ధునిం జేయుగాక ప్రపితామహుండును నన్ను బరిశుద్ధునిం జేయుగాక. పూర్ణాయువు గలవానిగా నన్నొనరించుగాక.

శ్రాద్ధమాచరించిన తరువాతఁ జిట్టచివరకు బితరులను విసర్జనముచేయుటకుఁ బూర్వము తన్నాశీర్వదింపవలసినదిగాఁ

బితరులంగూర్చి ప్రార్థింతురు. ఈ మంత్రములో మూడు తరముల వఱకునున్న పితరులనుండి మాత్రమే యాశీర్వాదమభిల షించుచున్నట్లున్నందువలన నంతవఱకుండు పితరులకే శ్రాద్ధ మాచరింపఁబడుచున్నది.

శ్రాద్ధమునందొక బ్రాహ్మణునకు భోజనముచాలదా ?

(౭) మఱికొందఱు మహాత్ములు" అయ్యా, ఒకబ్రాహ్మ ణునకుఁ భోజనముపెట్టినఁ జాలదా? ఎయిరువురనో యేయిరువ దైదుగురనో పిలిచి భుజింపఁజేయవలెనా ? దీని వలనఁ బితరులు పొట్టలుపగిలి పోవా ? ఇదియేనా మీసంకల్పమని తిరిగి యడిగెదరు.

ప్రత్యుత్తరము: హిందూమతమునందు స్వభావముగానే చాల దయయున్నది. మాపితరులు నివసించియున్న ప్రదేశము నందిట్టి పితరులే యితరులు చాల మంది యుందురనియువారి కొడుకులు శ్రాద్ధముల జేయుటకు భయపడి నిజధర్మమునే విడిచిపెట్టి పోయిరనియు మాపితరులు హాయిగా భుజించెడి సమ యమందు వారి ప్రక్కనేయున్న యితరులగు పితరులు పస్తుం డుట యెంతమాత్రము బాగుండలేదనియుఁదలఁచియుండుటంబట్టి మేము శ్రాద్ధములందు బ్రాహ్మణుల నెక్కువగా నాహ్వానించి భుజింపఁజేసెదము. దీనితాత్పర్యమేమనఁగా, మాపితరులు గడు పారభుజింపవలసినదనియుఁ మిగిలిన యున్నయెడల నాయన్న మును సదావృత్తి పద్ధతిని మాపితరుల ప్రక్కనుగూర్చుండి యున్న వారును, శ్రాద్ధమువలన భయపడి నిజధర్మమును విడిచి నాస్తికులైన కొడుకులు గలవారును నగు నితరులగు పితరులకుఁ

గూడఁ బెట్టవలసినదనియే. విచారింపఁగాఁ బార్వణశ్రాద్ధమునందు ముగ్గురు బ్రాహ్మణులకు భోజనము పెట్టవలసినదనియున్నది. కాని యీ నియమము క్షయాహశ్రాద్ధమునందుఁ గన్పట్టుటలేదు. క్షయాహమనఁగా మృతతిథి. "క్షయాహేభూరి భోజన"మ్మని స్పష్టముగా వ్రాయఁబడియున్నది గదా.

### మృతకశ్రాద్ధమునకు సాక్షులెవరు ?

(౮) మృతక శ్రాద్ధమున కితిహాసము సాక్ష్యముచెప్పుటలేదని మఱికొందఱడుగుచున్నారు.

ప్రత్యుత్తరము: మూఢుతరములనుండిగూడ నితిహాస మెఱుంగనివారే యిట్లడుగుచున్నారు. పాండుమహారాజునకు శ్రాద్ధమొనర్చిరి. ఈవిషయముంగూర్చి మహాభారతమిట్లు చెప్పుచున్నది.

"తతఃకుంతీచరాజాచ, భీష్మశ్చసహబంధుభిః
దదుశ్శ్రాద్ధంతతః పాండోస్స్వధాఽమృతమయంతదా॥ ౧
మహాభా॥ ఆది॥ అ౧_౨౮

తరువాతఁ గుంతీదేవియు ధృతరాష్ట్రమహారాజును, భీష్ముండును, బంధువులును గలిసి పాండు మహారాజునకు స్వధామృతమయమగు శ్రాద్ధమును జేసిరని వైశంపాయనమహర్షి వచించెను కేవలశ్రాద్ధమునే చేసియుండలేదు. బ్రాహ్మణులకు భోజనము పెట్టిరి. కేవలము బ్రాహ్మణులకు భోజనము పెట్టుటయేకాదు. వారికి శ్రాద్ధ దక్షిణగూడ నిచ్చినట్లు తెలియుచున్నది. వినుఁడు.

"కుమారాంశ్చవిప్రముఖ్యాంశ్చ, భోజయిత్వాసహస్రశః
రత్నాద్యాన్విప్రముఖేభ్య, స్తథాగ్రామవర స్తథా॥ ౨

మహాభా॥ఆది॥౧౨౮౫

నిజకులస్థులగు కౌరవులకును, వేలకొలందిగా నున్న బ్రాహ్మణులకును భోజనము పెట్టి బ్రాహ్మణులకు రత్నముల కుప్పలు, గొప్పగొప్ప గ్రామములు మున్నగువానిని దక్షిణగా సమర్పించిరి. పద్మపురాణములోని సృష్టిఖండమునందలి ముప్పది మూడవయధ్యాయములో నిట్లున్నది.

శ్రీరామచంద్రమూర్తి వనవాస మొనర్చెడి సమయమందు దశరథుని శ్రాద్ధదినము సంభవించెను. పూర్వరాత్రి యందే బ్రాహ్మణులను నిమంత్రించెను. మరునాఁడా బ్రాహ్మణులు నిమంత్రణమునకు వచ్చినప్పుడు సీతాదేవి వారినిఁ జూచి కన్పడకుండఁ బోయియుండెను. శ్రీరామచంద్రప్రభువు బ్రాహ్మణుల పాదములను గడిగి వారికి భోజనము పెట్టి పంపించివేసి తుట్టతుదకు జానకీదేవికడకు వచ్చి 'సీతా ! నేఁడు నీమామగారి తద్దినముగదా! ఋషులు నిమంత్రణమునకై వచ్చియుండిరి? నీవు వారినిం జూచి కనుపడకుండ నెచటనో దాగితి వెందులకు. అని యడిగెను. ఇది విని సీతాదేవి యిట్లు చెప్పుచున్నది.

పితా తవ మయా దృష్టో, బ్రాహ్మణాంగేషు రాఘవ!
దృష్ట్వా త్రపాన్వితాచాహ, మపక్రాంతా తవాంతికాత్॥
యాహం రాజ్ఞాపురా దృష్టా; సర్వాలంకారభూషితా
సా స్వేదమలదగ్ధాంగీ, కథం పశ్యామి భూమిపం॥

స్వహస్తేన కథం రాజ్ఞే, వానేయం భోజనం త్విదం
దాసానామపి యద్దాసః, కదాచిన్నైవ భుంజతే॥

రాఘవా! నేను ఋషులతోఁగూడ మీ తండ్రిగారు వచ్చుటను జూచి లజ్జగలిగిన కారణమువలన మీసమీపమునుండి తొలఁగి పోయి కన్పడకుంటిని. నా వివాహమగుచున్న కాలములో సర్వ భూషణభూషితురాలనై యున్న నన్ను మీ తండ్రిగారు సూచి యానందము పట్టఁజాలకుండెను. తరువాత నయోధ్యాపు రమునుండి నేను వనవాసమునకై వచ్చుచున్నప్పుడు మీతండ్రిగారునాతపస్వినీ వేషమును విని తన దేహ మును ద్యజించివేసి యుండెను. ఈ సమయమున వనవాస మొన ర్చుటచే నా శరీరమునందు నలుపు వన్నెయు మలినమునుజేరి యున్నవి. ఇట్టి నేను మీతండ్రిగారి యెదుటకుఁ బోయినయెడల మీపిత సూచి దుఃఖితుఁడై పితృదేవతాశరీరమును విడిచివేయు నేమో యని సందేహించి తమ సన్నిధినుండి యీవలకు వచ్చితి ననెను. ఇదిగాక మఱియొక కారణము నాకు భయము గలిగిం చుచున్నది. ఆభయ మేదనెదవా? 'సీతా! నీవు భోజనమునకు గావలసిన పదార్థములను వడ్డింపు' మని మీరనఁగలరు. అనినచో 'అబ్బా! మీరే చెప్పుఁడు. నేను నాచేతితో నిట్టి వానేయ భోజనము (అడవిలోఁ జిక్కెడి ఆకులుఅలము మున్నగువానితోఁ జేయఁబడినది)ను నా మామగారి విస్తరిలో నెట్లు వడ్డింపఁగలను? ఈయడవికుడుపును మీతండ్రిగారి బానిసీంద్ర బానిసలుగూడ నెట్టితరుణమందును దినియుండరు. ఇందఱు సాక్షు లితిహాస ములలో నుండగా నితిహాసములందు శ్రాద్ధము లేదని వాదించెడి

వారి నేమనవలయుననో పాఠకులే యోజింతురుగాక. మన ప్రతి వాదు లిట్టి యితిహాసములపై దృష్టి నుంచుదురుగాక.

బ్రతికియున్నవారికిని నెన్నడో చచ్చిన పితరులకు సంబంధమున్నదా?

(౮) మరికొందఱు మహామహులు మాతండ్రులు చచ్చి పదియేండ్లో యంతకంటె నెక్కువగానో గడచినవి. ఇఁకనిప్పుడు బ్రతికి యున్నమాకును నెన్నడో చచ్చిన పితరులకు సంబంధ మున్నదా యని యడుగఁదొడఁగెదరు. ప్రత్యుత్తరము. వినుఁడు. తండ్రియిప్పిచ్చిన రూపాయలొకనినుండి రావలసియుండెను. కొడుకారూపాయల నొసంగవలసినదిగా నప్పుదీసికొన్నవాని నడిగినచో నతఁడు నీతండ్రికిని నీకును సంబంధమేమి యన్న తోడనే విని యీకుమారుఁడు మండిపడి "అయ్యా, వినుఁడు. మర్యాదగా రూపాయలిచ్చినచో మర్యాదగాఁ దీసికొనఁగలను. లేనిచో కోర్టు (న్యాయసభ) ద్వారములుదెరువఁబడియున్నవి నేఁభియోగము (వ్యాజ్యెము)వేసి తీసికొందునులెమ్ము! నీవెట్లు మాట్లాడెదవు? నీకు నీతండ్రికేమి సంబంధమున్నదనియా! నాతండ్రిని గాల్చినవాఁడను నే నే, మాసముల గొటిగించుకొనినది నే నే, అతనికిఁ బుట్టినవాఁడను నేనే, అతఁడు నాతండ్రి. ఇంక సంబంధమేమని యడిగెదవాయని గద్దించును. ఇచ్చట రూపాయలు రావలసియున్నవి. కాఁబట్టి సంబంధముగూడఁ దత్క్షణమే తటాలున వచ్చుచుండును. వాహ్వారే! బలేమాట! రూపాయలు చిక్కెడి యెడల నీకు దండ్రికి దృఢసంబంధముండుటయు నితరులకు రూపాయల నీవీయవలసివచ్చి నప్పుడెట్టి సంబంధమును లేకపోవుటయునా? భళీ! భళీ! మంచిసిద్ధాంతమునుమీా!

"మాలఖిలే మహహోజాయ్‌రాజీ
దేనాపడేతో బన్నెఁ సమాజీ॥"

సొమ్ముచిక్కినప్పుడు తండ్రికిఁ బూర్ణసంబంధమంగీకరించు టయు, సెనిమిదణాలపైసలు వ్యయముజేయవలసినప్పుడు పండితవర్యా! నానామము మరియొక సమాజములో వ్రాయించితినని చెప్పుటయు నగుచున్నది. ఆహా! అందఱకు నర్థము ప్రియము. అందునను ఘన ప్రతివాదుల కత్యంతప్రియము. తండ్రి కొడుకులకుఁ గల సంబంధముతో సమమైనది మరియొక సంబంధమేదియులేదు. దివ్యంబగు నన్నమును దినుచున్నప్పుడు తల్లివండిన యన్నమును వడ్డించు తరుణమందు 'కుమారా! ఈశ్వరుఁడను గ్రహించినచోఁ గొలఁది దినములలోనే నీకదృష్టము పట్టఁగలదని యన్నంతనే కొడుకత్యంతముగా నానందించిపోయి సంతోషము గల్గినకారణమున భోజనముగూడ సరిగాఁజేయక చేతులను గడిగికొని వెలుపలకు వచ్చెను. ఇంతలోనే యొకరిరువురు మిత్రులేతెంచిరి.

అందులో నొకఁడు 'నేడేమికార్యమైనది? ఏయభియోగమునైన గెల్చితివా? నేఁడు చాల సంతోషముగ నున్నావు. నీకు నిక్షేపమేమైనఁ జిక్కినదా? యని యడిగెను. అందులకతఁడు 'కాదయ్యా, శ్రీవారు తండ్రి గాఁబోవుచున్నారు అని చెప్పెను. ఆంత మిత్రు లట్లయినచో మేముగూడ విందుగైకొందుము అని యనిరి. దానికతఁ డాహా! యని యంగీకరించెను. ఒకమిత్రుఁడు లేచి విందెట్లయినను జరుగును, కాని నీవేమి చదివింపఁ దలఁచితివో చెప్పుము. నాదృష్టిలో న్యాయవాదిత్వము

(బారిస్టరీ)చదివింపవలెనని గోచరించుచున్నది. ఇది వినిన యింకొక సంగాతకాఁడు 'కాదు కాదయ్యా! స్థాపత్యకక్ష్య (ఇంజనీయర్ క్లాస్) లోనికి 'రుడి' యను పట్టణమునకుఁ బంపవలెనుఁ వర్తమానకాలమున దివ్యన్యాయవాదిత్వము కంటె స్థాపత్యవిద్యకే యెక్కువ లాభము గలదని యనెను. తరువాత మూడవ నేస్తకాఁడు మీరు చెప్పినది నాకు నచ్చలేదు, నేను నాశక్తికొలఁది వైద్యవిద్యయందుఁ గృతార్థునిఁ జేయఁగలననియు వైద్యునకు (డాక్టరు) న్నంత యధికారము రాజప్రతినిధి (వైస్రాయి) కి గూడ లేదనియుఁ దలఁచినచో నొకనిని బిచ్చివానినిగాఁ జేయఁ గలఁడనియు నిష్టమువచ్చిన మఱియొకని కరచరణములను ఖండింప వచ్చుననియు వీని కత్తి కెదురుకత్తి లేదనియు వచించెను. ఈ ప్రకారము వారుల్లాసముగా నెగురుచున్నారు. కాని అలులేదు ప్రోలులేదు కొడుకుపేరు సోమలింగ మనినట్లిది యున్నప్పటికిని సంబంధము లేనిచో నింత ప్రేమ యెవరు చూపఁగలరు?

గర్భవతి యగు తల్లి ప్రసూతివాతములచే నెక్కువగ బాధ పడు సమయమందుఁ దండ్రి చుట్టములను బిలుచుటకుఁ బోయి తిరుగుచుండును కాని ముసలితాత వెలుపలివాకిలికడఁగూర్చుండి యుండును. లోపల నొక గిన్నె యుంచఁబడును. అట్లు గిన్నెను బెట్టుట యెందులకనఁగా తల్లి బిడ్డను గనిన వెంటనే గిన్నెను వాయించి జాతకములో వ్యత్యాసము రాకుండ ఎచ్చుతచ్చులు లేకుండ సరియైన జననకాలము దెలిసికొనఁబడును. అతఁడా గిన్నెను వాయించిన వెంటనే సూతికయగు మాత యాధ్వనిని వినినాకుఁ బుత్రుఁడు గల్గెనని గ్రహించి సమస్త కష్టముల నవలకుఁ

ద్రోసివేసి యానందసముద్రమందు మునిగి తేలుచుండును. తండ్రియు నాగిన్నెసవ్వడిని నాలకించియెల్లబాధలను దూరీకరించి మిత్రులచే నిశ్చయింపఁబడిన కర్తవ్యమునందుఁ బ్రవేశించును. ఇంక ముసలితాత యమితముగ సంతోషించి యేది కాఁదగి నదో యది యగుచుండును. కాని రెండు పుడిసెళ్ళ నీరును (తర్పణము) నిచ్చెడి పిల్లవాఁడు పుట్టెనని యనుచుండును. ఆరెండు పుడసెళ్ళనీటిపైనా నేడింత యాక్షేపణము? తండ్రి కొడుకును బుట్టింపక యున్నయెడల నతఁడు బ్రహ్మచర్యమందలి దివ్యశక్తితో బ్రహ్మాండమును బ్రద్దలుగావించి దాని ద్వార మునఁ బ్రాణమును వెడలిచి మోక్షమునకుఁ బోయెడివాఁడు. ఈవిషయమునుగూర్చి యెల్లశాస్త్రములు చెప్పుచున్నవి.

'ద్వావిమౌ పురుషౌ లోకే, సూర్యమండల భేదకౌ।
సన్న్యాసీ యోగయుక్తశ్చ, యశ్చ యుద్ధరణే హతః,

ప్రపంచమునందు సూర్యమండలమును భేదింపఁజాలినవారి యిరు వురు మాత్రమే (౧) సన్న్యాసి యగు యోగి (౨) యుద్ధ రంగమునం దెదుర్కొని మృతిజెందిన వాఁడు. ఇంత దయాళుఁ డగు తండ్రి, నీకొడుకుఁ దన బ్రహ్మచర్యమును ధ్వంసముచేసి కొని 'కుమారా! నారసము (వీర్యము)చే నీశరీరమును జేసితిని. నేను మరణించి నాశరీరము పితృలోకమునకు సిద్ధమయ్యెడి తరు ణమందు దానిని సిద్ధమొనర్చుటకు నీవు రెండు పుడిసెళ్ల (తర్ప ణాది) జలము నొసంగుమని చెప్పును. తండ్రి తన రసము(వీర్యము) నకు బదులుగా రసము (తర్పణాదిజలము)ను గోరుచున్నాఁడు.

అధికముగా (వడ్డి) గూడఁ గోఁటలేదు. రసమునకుఁ బ్రతిగా రస మిచ్చుటయందుఁగూడ నింత తర్కించుట యెట్టియోగ్యతయో తెలియకున్నది.

హిందువులలోఁ గపాలక్రియ యొకటి జరుగుచుండును. మృతపితయొక్క శవమును చితియందుంచి చిచ్చు బెట్టఁబోవునపుడు కొడుకు తండ్రి తలను బగులగొట్టెడి యీ పనికి 'కపాల క్రియ' యని నామము. ప్రస్తుతకాలమునఁ గొందఱు హిందులిద్దానిని గూడఁ బరిహసింపఁదొడఁగిరి. దీనిఁగూర్చి శాస్త్రకారుల యభిప్రాయ మేమనఁగా, తండ్రి యూర్ధ్వరేతస్కుఁడైనప్పు డతని వీర్యము బ్రహ్మాండమును భేదించి మోక్షపదమునకతని బంపఁగలదు. ఇప్పుడీ పిత, పుత్రోత్పత్తి నొనర్చినందు వలననినధోరేతస్కుఁ డయ్యెను. దీనివలన నితని వీర్యము పైకిఁ బోలేక నేలపైఁ బడెను. వీర్యమూలమునఁ గపాలము బ్రద్దలయినప్పుడే మోక్షము గలుగును. ఇప్పుడట్లుగా లేదు. ఇందు వలనఁ బుత్రుఁడు 'అయ్యా! నీవీర్యముచే శరీరమును ధరించిన నేను నీ చెంత నిల్చియున్నాను. నీవీర్యరూపమైన నే నిప్పుడు నీకపాలమును బ్రద్దలుచేసి ప్రాణవాయువును దీసివేయుచున్నాననెడి భావమును గైకొని కపాలక్రియ జరుపఁబడుచున్నది. కాని వేదములందు శ్రద్ధయుంచి తన మృతులగు పితరుల మేలుకొఱకు వేదమందుఁ జెప్పఁబడినట్లు శ్రాద్ధ మొనర్పవలెను. ఇది సత్పుత్రుల పనియై యున్నది. ఇతరులది గాదు. దీనింగుఱించి యొక సత్కవి యిట్లు చెప్పినాఁడు.

కుదేశమాసాద్య కుతో౽ర్థసంచయః ।
కుపుత్రమాసాద్య కుతో౽జలాంజలిః
కుగేహినం ప్రాప్య కుతో గృహేసుఖం -
కుసిష్యమధ్యాపయతః కుతో౽యశః॥

చెడుచోటికిఁబోయి ధనము సంపాదింపఁ జాలఁడు. చెడుదానిని బెండ్లాడినవాడు గృహమునందు సుఖమును బొందఁజాలఁడు. చెడు శిష్యునకుఁ జదువు చెప్పినవాఁడు కీర్తిని బొందఁజాలఁడు. చెడుకొడుకును గనినవాఁడు జలాంజలి (తర్పణము) గైకొనఁ జాలఁడు.

నేఁటికాలమున వైదికమగు శ్రాద్ధము హిందువులకు శత్రుసమానముగాఁ గనుపడుచున్నది. కాని యొకనాఁడు భరత వర్షమందలి యొక మహమ్మదీయ చక్రవర్తి యీవైదిక శ్రాద్ధ మును శిరసావహించియుండెను. దీని పూర్వచరిత్ర మేదనఁగా, ఔరంగజేబు దుష్టుఁడై తన తండ్రియగు షాజహాను గారా గారములోఁ బెట్టినప్పుడు ప్రతిదిన మింత రొట్టెయు, నొక చెంబెడు నీళ్లును దండ్రికి నీయవలసినదని నియమించియుండెను. చక్రవర్తియునట్టి నియతమగు భోజనమును, నుదకమును గ్రోలి కాలము గడుపుచుండెను. ఒక నాఁడా షాహజహా, మంచము నుండి క్రిందికి దిగుచుఁ జూడక కాళ్లు నీళ్లచెంబుపైఁ బెట్టెను. వెంటనే యా చెంబులోని నీళ్లన్నియు దొరలిపోయెను. పాపము ప్పుడతఁడు నీళ్లులేక యతిదాహముచేఁ బీడింపఁబడుచు నౌరంగ జేబు చక్రవర్తినిం బిలిపించి 'కుమారా! నేఁడు నీవిప్పించిన నీరు దొరలిపోయినది. ఇది జ్యేష్టమాసము. మండు వేసగి. దప్పి

కచే గొంతుక పూర్తిగా నెండిపోయినది. కాఁబట్టి మరియొక
చెంబెడు నీళ్లను బంపుమని చెప్పెను. ఈమాటవిని యారంగ
జేబు నీకోఅ కా చెంబెడు నీరు నియమింపఁబడినది. అంతియే
త్రాగుము, లేదా దొర్లించుకొనుమని ప్రత్యుత్తరమిచ్చెను. అట్టి
తరుణమందు షాహజహా రెండు చేతులతోఁ దలపై మోఁదు
కొనుచు లేచి యిట్లుపలికెను.

'ఐపిసరతో అజబముసలమానీ
జిన్దాజానముబ ఆబతరసానీ
ఆఖరీబాదహిందవాహారబాబ
ముర్దగాఁరాం దేహన్దాయమ ఆబ॥'

కొడుకా! నీవు బలేమహమ్మదీయుఁడవు. నేను బ్రతికి
యుండగానే నీళ్లకై నా ప్రాణమల్లాడఁబెట్టుచున్నావు. హిందు
వులు ప్రతివిషయమందును బ్రశంసాపాత్రులగుదురు. వారు
చచ్చినవారికిఁగూడ నెల్లప్పుడు నీళ్లొసంగుచుందురు. (తర్పణము
విడుతురు) పాఠకులారా! నేను శాస్త్రములలోని యొక
ప్రమాణమైనను నొకయుక్తియైనను మృతకశ్రాద్ధమును ఖండింపఁ
జాలదని నిరూపించియుంటిని. కాఁబట్టి సంఘసంస్కారి బ్రువు
లగు నాస్తికుల మోసములోఁ బడి మీ కర్తవ్యమగు మృతక
పితృశ్రాద్ధమునుండి యెన్నటికిని గూడఁ జలించిపోరని నమ్ము
చున్నాను. తరుచుగా నిక్కాలమున జరిగెడి శ్రాద్ధము
లాచారపద్ధతి ననుసరించి యగుచున్నవి. వానిని వేదోక్తపద్ధ
తిపై నడుపవలయును. శ్రాద్ధమునందు భక్తియు, శ్రద్ధయు
బ్రేమము మిక్కిలియవసరమై యుండును. ప్రస్తుతమునఁ బాశ్చా

త్యవిద్యాప్రభావముచే సాధారణముగా శ్రద్ధాదులు కుంటుపడు చున్నవి.

ఇందుల కొక యితిహాసము పాఠకుల వినోదార్థము వినిపింపఁ దలఁచితి. ఒకనాఁడొక న్యాయవాది [వకీల్] గారియొక్కతండ్రి శ్రాద్ధమై యుండెను. అతఁడు తన కొలువుగాని నొకనిని బిలిచి యొక యెనిమిదిమంది పండితులను నిమంత్రింపవలసినదిగాఁ జెప్పి పంపించి తాను పదిగంటలు కొట్టుటతోడనే యన్నమును దిని న్యాయసభ [కోర్టు]కుఁ బోయెను. అతఁడు పోవునప్పుడు తన సేవకున కొక రూపాయ నిచ్చి యంగడినుండి ఫేణీలను దెచ్చి బ్రాహ్మణులకుఁ దినపెట్టి నాలుగేసి పైసలచొప్పున నొక్కొక్క రికి దక్షిణ నియ్యవలసినదిగాఁ జెప్పియుండెను. ఆసేవకుఁడుగూడ మహమ్మదీయుఁడై యుండెను. అతఁడాడబ్బును మిగిలించు కొనుటకై పనికిరాని ఫేణీలను దెచ్చిపెట్టెను. అందువలన నా బ్రాహ్మణులు కడుపునిండునట్లు దినక యింటికిఁ బోయిరి. తరు వాత రాత్రివేళలో న్యాయవాది తీరికగాఁ గూర్చుండియుండెను. ఆ బ్రాహ్మణులలో నొకఁడువచ్చి కూరుచుండెను. అతఁడు కవిగూడనైయుండెను. అప్పుడా న్యాయవాది "అయ్యా పండితులవారూ! చెప్పుఁడు. నేఁటిభోజనము మీకు రుచికర ముగానైనదిగదా! యని యడిగెను. అంత నా బాపడు 'వహ్వా! వకీలుగారూ! నేను ప్రపంచములోఁ బుట్టిననాటినుండియు నింత వఱకుఁ జిక్కనట్టి ఫేణీల భోజనమును భుజించితి మని చెప్పెను ఆన్యాయవాదియు ఏమీ! యట్లు మాట్లాడుచున్నారు. అవి

యంతబాగుగా నున్నవా? యని యడిగెను. అంత పండితుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

చీటీనచాటత మూసనసూంఘుత,
వాసనసోంమాఛీనఆవత నేరే ।
ఆనిధరే జబతేఘరమే,
తబతేరహోహై జావరోసిన ఘేరే॥
భూవి హు ఖాయజోవేయకోడూ,
తబఘూమతదూండతహాంరబహారే॥
చౌంకి పరో యె పితృలోకమె బాప,
సుఆపకేదేఖసరాధకేపేరే॥

అయ్యా! మీ ఫేణీలను చీమలుకూడఁ దాకవు. ఎలుకలు మూకొనవు గబ్బువలన నీగలుగూడ సమీపింపవు. మీరు తెప్పించి యింటిలోఁ బెట్టినప్పటినుండి యిరుగుపొరుగువారలకు విషూచి (కలరా) గలిగినది. ఎవఁడైన నొకఁడు పొరబాటున దిన్నచో నతఁడు కరకకాయ, నేపాళము గింజలను వెదుకవలసి నదే. కాఁబట్టియే మీ శ్రాద్ధములోని ఫేణీలను జూచి పితృలోకమందు మీతండ్రిఁదిగులుపడెను. అని యర్థము.

ఇది శ్రాద్ధవిధిగాదు. మనుస్మృతి తృతీయాధ్యాయములో శ్రాద్ధవిధిని చూడఁదగినది. ఈ విధి ననుసరించి శ్రాద్ధమాచరించుట యాస్తికులకు ముఖ్యకర్తవ్యము. శ్రేయోదాయకమునగును.

విదేశమూఁర్థికోన్నతిని దినక్రమమున వృద్ధిజేసికొనుచున్నట్లు భరత వర్షము పంశయోన్నతిని బొందుచున్నది. కేవలము ఈ

మొదటి తొమ్మిది శంకలును శ్రాద్ధవిషయముపై నాయెదుట నుంచఁబడియుండెను. ఇప్పుడింకఁ గొన్ని సంశయము లతిశ యించినవి. అట్టివానికిఁ గూడఁ గ్రమముగాఁ బ్రత్యుత్తరము లొసంగఁబడుచున్నవి. కనుఁడు.

మృతులకే తృప్తికారణమైన శ్రాద్ధము జీవితుల కేల కాదు?

(౧౦) మృతులగు పితరులకే యన్నము చిక్కుచున్న ప్పుడిఁక విదేశములకుఁ బోయెడి మనుష్యులకు అన్నము రొట్టె మున్నగునవి చేయవలసిన యవసరము గానరాదు. తన యింటిలో భోజనమును సిద్ధమొనర్చి యొక బ్రాహ్మణునకుఁ బెట్టిన యెడల విదేశములకేగిన మనుజుల కడుపులు నిండి తృప్తి గలుగునుగదా యని మన సోదరులు మరల ప్రశ్నింతురు.

ఈ శంక యిప్పటిదిగాదు. చాల ప్రాఁతది. ఆస్తికులదిగాదు వేదవిరోధియగు చార్వాకునిదై యున్నది. దీనింగూర్చి చార్వా కుని వ్రాతయిట్లున్నది:

"మృతానామిహజంతూనాం, శ్రాద్ధంచేత్తృప్తి కారణం
జీవితామిహజంతూనాం, వృథాపాథేయకల్పనం॥"

ఈ ప్రపంచమునందు శ్రాద్ధము మృతజంతువులకుఁ దృప్తి కారణమైనచో జీవించియున్న జంతువులకుఁ బాథేయము (దారి బత్తెము) నిచ్చుచుండుట వ్యర్థము. మృతులకు భోజనము చిక్కి నట్లు జీవితులకుఁగూడఁ జిక్కునుగదా. ఇప్పటిదేశాభి వృద్ధికి కంట్రాక్టరులగు వారియొక్కయుఁ జార్వాకునియొక్కయు, శంక పూర్తిగా నొక్కటియే. చార్వాకుఁడు ప్రపంచములోనుండి వేదమును నెట్టిపారవేయవలయునని తలఁచి యుండెను. వేదమం

దున్న గౌరవమును బొందుచేయుటకే వాఁడిట్టి శంకను లేవదీసి యుండెను. చార్వాకునివలె నేటికాలపు దేశోద్ధారకులుఁగూడ వేదవిరోధులని మేము చెప్పినచో న్యాయమెట్లు గానేరదు ? చార్వాకుని శంకను బట్టి చూచినచోఁ బ్రపంచమందు వేదము నకు గౌరవములేకుండఁ జేయవలయుననెడి యతని యభిప్రాయమే వీరికున్నట్లు తోఁచుచున్నది. ఈకాలపు నాగరకులు చార్వాకుని సిద్ధాంతములను గౌరవించెదరా? అట్లు గౌరవించెడి యెడల వారిని రెండేసి మాటల నడుగుచున్నాను.

చార్వాకుఁడిట్లనుచున్నాఁడు:

"నస్వర్గో నైవనరకో నభవతి మనుజో దేహభిన్నో నకశ్చిత్"

స్వర్గములేదు. నరకమెట్టిదియులేదు. శరీరముకంటె వేఱగు ఆత్మయులేదు. మరియు నిట్లు చెప్పుచున్నాఁడు. 'మూర్ఖాణామీశకల్పనా' మూర్ఖులగువారీశ్వరుని గల్పించెదరు. ఇంకఁ బునర్జన్మముంగూర్చి యిట్లు వ్రాయుచున్నాఁడు.

యావజ్జీవేత్సుఖం జీవే, దృణం కృత్వా ఘృతం పిబేత్
భస్మీభూతస్య దేహస్య, పునరాగమనం కుతః॥

జీవమెంతవరకుండునో యంతవఱకు సుఖముగాఁ బ్రతుకుము. అప్పుగొని యాజ్యమును (నేయి) ద్రాగుము. ఎందులకనఁగా, ఈప్రపంచమే సుఖ భోగముల కేర్పడియున్నది. ఇచట బూడిద మైన శరీరము తిరిగి యెట్లు రాఁగలదు?

పైనఁ జూపిన వ్రాతలవలనఁ జార్వాకులు స్వర్గము, నరకము, పునర్జన్మము, జీవునిని, ఈశ్వరుని నమ్మరనియు నేటి కాలపు సంఘసంస్కర్తలు జీవుని, ఈశ్వరుని, పునర్జన్మమును

విశ్వసింతురనియుఁ దెలియుచున్నది. నేను వీరిని ( సంస్కర్త లనుకొనువారిని) మీరు జీవుని, ఈశ్వరుని, పునర్జన్మమును విశ్వసించెదరు. ఇఁకఁ జార్వాకులో వానిని నమ్మరు. ఇందుఁ దప్పెవరిది? సంస్కర్త నీవిషయముపై జీవేశ్వర పునర్జన్మములను నొప్పుకొనకపోవుట చార్వాకులతప్పే యగును గాని మాతప్పె న్నటికిని గాదని ప్రత్యుత్తర మిత్తురు. ఇదేమి నవ్వులాటా! తొలుతఁ జార్వాకులను విద్వాంసులనుగాఁ బరిగణించి వారి యుక్తులతో మృతపితృశ్రాద్ధము నెగురగొట్టివేయుటకు బయలు వెడలితిరి. ఇఁక జీవేశ్వరపునర్జన్మముల సంగతి వచ్చినప్పుడా చార్వాకులును మూఢులనుగాఁ జేసివేసితిరి. ఇది సంస్కర్తల యొక్క ప్రతిరూపము (ఫోటో) ప్రపంచ సమ్ముఖమున నుంచ బడినది. చూడుఁడు. వీరెవరిని బండితులనుగాఁ దలంచిరో యా చార్వాకులనే బండలను జేయుదురు. ఎవరిని బండలనుగాఁ దలంచిరో యక్కఱవచ్చినప్పుడు వారినే విద్వాంసులని చెప్పిరి. ఇదెట్టి న్యాయమగును? ఈకాలపు నాగరకులు జీవేశ్వరపునర్జన్మవిషయములందుఁ జార్వాకులను మూర్ఖులని నిరూపించినట్లే మృతకశ్రాద్ధము, జీవేశ్వరులు, పునర్జన్మము, మున్నగు సమస్త విషయములందును జార్వాకులను మూఢులని మేము చెప్పిన యెడల మాదెట్లు న్యాయము గాఁజాలదు? న్యాయమగును. అన్యాయము గానేరదు. ఇఁకఁ జార్వాకయుక్తులతో మృతపితృశ్రాద్ధము ఖండింపఁబడదు. కాని యొకరీతిగా మండనమే కాఁగలదు. ఎట్లనెదరా? చార్వాకులు శ్రాద్ధమును ముందు పెట్టి వేదమును నన్నృతముగాఁజేయ వాదించుచున్నారు. దీనింబట్టి

వేదములో మృతకపితృశ్రాద్ధ మవశ్యముగా నున్నట్లు సిద్ధించినది గదా. వేదములో మృతకపితృశ్రాద్ధము లేనియెడల శ్రాద్ధము మిథ్యయని నిరూపించి వారు వేదము లొప్పుకొనఁ దగినవి గావని యెట్లు చెప్పుదురు? చార్వాకుల యుక్తులకుఁ బ్రత్యుత్తరము లొసంగఁబడినవి. ఈప్రత్యుత్తరములవలనఁ జార్వాకులు పరాజయము బొందిరి. నేనాప్రత్యుత్తరము నిచట వ్రాసినయెడల వారిముఖ్యప్రియశిష్యులగు మన సంస్కర్తలబుద్ధిగూడ 'స్వాహా' కాఁగలదు. అది యిది.

> "మృతానామేవజంతూనాం, శ్రాద్ధంవేదేషు ఘోషణా।
> జీవితాః పితరస్త్యక్తాః, మనునా శ్రాద్ధకర్మణి॥"

మృతులగు పితరులకే శ్రాద్ధము జరుపఁబడును. ఇది వేదముల చాటింపు. శ్రాద్ధకర్మమందు బ్రతికియున్న పితరులు విడిచిపెట్టఁబడిరి. ఇది మనుకథనము. శ్రుతిస్మృతులిట్లు బ్రతికి యున్నవారికి శ్రాద్ధఫలము నిషేధించుచున్నప్పుడు తిరిగి యా జీవితులగు పితరులకెట్లు శ్రాద్ధఫలమందఁగలదు? ఒక పాఠశాలలోఁ బిల్లవాండ్రు చదువుచుండిరి ఆ సమీపమున నొక గొల్లవాఁడు కాపురముండెను. వాఁడు నాలుగైదు గోవత్సములను వెంటఁ బెట్టుకొని యుపాధ్యాయుని కడకు వచ్చి 'అయ్యా! మీరీ గోవత్సములను మధ్యమపరీక్ష (మిడిల్ స్కూల్) యందు కృతార్థులనుగాఁ చేయవలసినదని ప్రార్థించెను. అందుల కుపాధ్యాయుఁ డివి చదువఁజాలవని చెప్పెను. తిరిగి గొల్లవాఁడు నేనెట్లునమ్మగలను? పిల్లవాండ్రు మాత్రము పఠింపఁగలరా? ఈగోవత్సములు పఠింపలేవా? ఇవి చదువలేని యెడలఁ బిల్ల

వాంగ్రము చదువఁజాలరు. వీరు చదువఁజాలిన నివియుఁ జదువఁ జాలునని యనెను. మూఢుడగు నీగొల్లవాఁడు బాలురను, గోవత్సములను సమానముగాఁ దలంచినట్లే నేఁటికాలపు నాగరకులు బ్రతికియున్నవారినిఁ జచ్చినవారిని సరిసమానముగా నెంచుచున్నారు. సరియే కాని యీబుద్ధిమదగ్రణులను జీవించియున్న మనుష్యులకు వివాహములు జరిపిన తీరుననే మీరే చచ్చినవానికైనను వివాహమును జేసినారా యని యడుగుఁడు. అట్లు చేయలేదని యనినయెడల జీవితులును మృతులును నెట్లు సమానులు గాఁగలరు?

ఏకకాలమందనేక స్థలముల జరుగు శ్రాద్ధములకుఁ బితరులెట్లు పోఁగలరు

(౧౧) ఒకనికైదుగురు కుమారులుగలరు. వారిలో నొకఁడు లాహోరునందును రెండవవాఁడు కలకత్తాయందును, మూడవవాఁడు బొంబాయియందును, నాల్గవవాఁడు నేపాలునందును, నైదవవాఁడు జపానునందును నివసించుచున్నారు. వారందఱిప్పుడేక సమయమందే శ్రాద్ధమారంభించిరి. అప్పుడు పితరులెచటెచటికిఁ బోఁజాలుదురని కొందఱు ప్రబుద్ధులు ప్రశ్నించుచున్నారు.

ప్రత్యుత్తరము: ఈ శంకవేసెడివారిది ముందు విచారింపవలసియుండెను. ఈశంకవలన జీవత్పితృ శ్రాద్ధ మెగిరిపోవుననెడి సంగతి పాపము! వారికి దెలియదు. దీనివలన మృతక శ్రాద్ధముకంటెజీవత్పితృశ్రాద్ధమునకే యెక్కువ దోషము సంప్రాప్తించుచున్నది. చూడుఁడు. ఒక సంఘసంస్కారిలాహోరు నందుండెనని యనుకొనుఁడు. అతని మొదటి కొడుకు యూరోపు

దేశమునందును, రెండవకుమారుడు జపానునందును, మూడవ వాఁడు నేపాలునందును, నాల్గవవాఁడు కరాచీయందును, నైదవ వాఁడు కలకత్తాయందు నుండిరని యెంచుఁడు. ఈ పుత్రులు 'యేఅగ్నిదగ్ధాఃయే అనగ్నిదగ్ధాః మధ్యేదివస్స్వధయామాద యంతే' యీవేదమంత్రము ననుసరించి సరిగాఁ బగలు పండ్రెం డుగంటలవేళ జీవితుండగు పితకు శ్రాద్ధమారంభించిరి. ఇప్పుడీ బ్రతికి యున్నతండ్రి యొక క్షణకాలములోనే యెక్కడికెక్కడికిఁ జేరఁగలఁడు? ఎంతసొబగుగా నున్నదో!

'హింస్రస్స్వపాపేన విహింసితః ఖలః,
సాధుస్సమత్వేన భయాద్విముచ్యతే॥'

హింసించెడి దుష్టుఁడు తన పాపముచేత స్వయముగానే చచ్చెను. సమానభావ మంతఃకరణమునందు నిండియున్న సజ్జనుఁడు భయముచే విడిపోవుచున్నాఁడు. ఈస్థితియే యీవిషయమం దును సంభవించినది. జీవత్పితృశ్రాద్ధమును నమ్మెడివారు మృతక శ్రాద్ధమును ఖండింప బయలుదేరి జీవత్పితృశ్రాద్ధమునే ఖండించి వేసిరి. ఇది తన్నఁబోయి తానే తన్నులఁ దిన్నట్లున్నది. ఏమిా! వీరి కుశాగ్రబుద్ధి! వహ్వా!

ఒకానొకండు జీవత్పితృశ్రాద్ధము ఖండింపఁబడినదిగావి దాని మృతకశ్రాద్ధమునకుఁగూడ మట్టిగొట్టఁబడినదని చెప్పఁ గలఁడు.

కాని యీశంకవలన మినుపగింజకుఁ దెలుపంటినంత మాత్రముగూడ మృతక శ్రాద్ధమునకుఁ దెబ్బతగులలేదని ధైర్య ముతో గట్టిగా నొక్కి వక్కాణింపఁగలను. బోధింతును. బోధ

పరచుకొనుఁడు. పితృయోనులలోనికిఁ బోయిన పితరుల యోగ మనము వేదము. 'యే నిఖాతా యే పరోప్తా ఆయన్తునః పితరః' అనెడి మంత్రములలో స్వీకరించి యున్నది. అట్టివారిపై నిట్టి శంకయే కలుగఁజాలదు. వారిది అమోఘగతి వాగొకక్షణము లోనే బొంబాయి కలకత్తా నేపాలు, హైదరాబాదు మున్నగు సమస్త ప్రదేశములకును జేరఁగలరు. ఇందు శంకింపవలసిన యవ సర మేమి? చంద్రలోకమునకుఁ బైననుండు పితృలోకమునుండి యొక నిమేషములో ఢిల్లీ (హస్తినాపురి)కి వచ్చెడి పితరులు ఢిల్లీనుండి బొంబాయి, నేపాలు, కలకత్తా లోనగుచోట్ల కొక క్షణములోఁ బోజాలరా? ఈ మార్గము పితృలోకముకంటె దూరమా? ఈశంకను శంకించెడివారల బ్రహ్మాండ విజ్ఞాన మెంత మాత్రము దెలియనివారని నిశ్చయింపవలెను. వేదశాస్త్రముల గుర్తెఱుంగని యీకాలపు మనుష్యులు మనుష్యులతో సమాన మగు శక్తియే పితరులకుఁగూడ నుండునని తలంచియుందురు. దేవతలయుఁ బితరులయు శక్తి యెంతవఱకున్నదని తెలుపఁ గలము? ఐన మనుష్యుఁడగు నొకయోగియందే కోట్లకొలఁదిగా నుండు నీవితండా వాదులలోలేని గొప్పశక్తియుండునని తెలియు చున్నది. మహాభారతమెట్లు చెప్పుచున్నదో చూడుఁడు.

"ఆత్మనో వై శరీరాణి, బహూని భరతర్షభ।
కుర్యాద్యోగీబలం ప్రాప్య, తైశ్చ సర్వైర్మహీం చరేత్॥"

యోగియగు పురుషుఁడు తన యొకయాత్మతో వందల కొలఁది శరీరములను ధరించును. మఱియు నాసర్వశరీరములతోనే కకాలమందు భూమిపైన సంచరించును. చెప్పుఁడు ఇట్టిశక్తి

సాధారణ పురుషులలోఁ గనుపడుచున్నదా? మహాభారతము చూపిన యిట్టి శక్తినిఁగూర్చి న్యాయదర్శనము ౩-౨-౧౯ దాని భాష్యమందు భాష్యకారులగు వాత్స్యాయన మహర్షులవారిట్లు లిఖించిరి.

"యోగీఖలు బుద్ధ్యాప్రాదుర్భూతాయాం వికరణధర్మా నిర్మాయ సేంద్రియాణి శరీరాంతరాణి తేషు తేషు యుగ పజ్జ్ఞేయానుపలభతే తచ్చైతద్విభౌజ్ఞాతర్యుపపద్యవే నాణౌ మన సీ తి॥"

సిద్ధిబొందినమీఁద యోగియగు పురుషుండు తనయొక శరీరముతోడనే యింద్రియములతోఁ గూడిన యనేకశరీరములను ధరించి యాయావివిధములైన శరీరములతోనొకకాలముననొక్కమారేయనేక విషయములఁ బొందుచున్నాఁడు. ఈశక్తియోగి యందుఁ గన్పట్టుచున్నది, యోగమువలన మనుష్యునకు గలిగెడి యాశక్తియే దేవతలలో స్వాభావికముగాఁ బుట్టుకతోడనే వచ్చుచున్నది. యోగదర్శనమిట్లు నుడువుచున్నది.

"భవప్రత్యయో విదేహప్రకృతిలయానాం"

పంచమహాభూతములవలన గలిగెడి స్థూలశరీరములేని దేవతలయందు యోగసిద్ధి జన్మతోడనే కలుగుచున్నది. యోగదర్శనము చెప్పిన యీసంగతిని నిరుక్తముగూడ నిట్లు చెప్పుచున్నది.

"యద్యద్రూపం కామయతే తత్తద్దేవతాభవతిరూపం రూపం మఘవాహో భవీతీత్యపి నిగమోభవతి ॥ని౹౧౦

అ । ౧౭౫౦

దేవత లేయేరూపములు గావలయునని కోరెదరో యా యా రూపములను ధరింతురు. రూపరూపమునకుఁ బ్రతిగా దేవేంద్రుఁడనేక రూపములను దాల్చునని వేదమందున్నది. ఇద్దానినే వేదముగూడఁ జెప్పుచున్నది.

"రూపరూపం మఘవా భవీతి, మాయాఃకృణ్వాన స్తన్వం పరిస్వాం త్రిర్యద్దివః పరిముహూర్తమాగా, త్స్వైర్మంత్రైరనృతాపాఋతావా। ఋ।మం 3।అ౪।సూ౫3।మం౮

ఇంద్రుఁడేయేరూపములను దాల్పనిచ్ఛగించుచున్నాఁడో యా యా రూపములను దాల్చుచున్నాఁడు. పెక్కురూపులను ధరించెడి సామర్థ్యము గల్గిన తన శరీరమునుండి యనేక శరీరములను నిర్మించుచున్నాఁడు- లేక నిజశరీరమును నానావిధములుగాఁ జేసి తనను స్తుతించెడివారి దివ్యవాక్యములతో నాహ్వానించెడివారి వేడుకోలువిని సోమపానమును నిరంతరము జేసెడి యింద్రుఁడు స్వర్గలోకమునుండి యొకముహూర్తమందే యనేక దేశములందు జరిగెడియజ్ఞములలోఁ మూడుసవనములందునువచ్చుచున్నాఁడు.

మనుష్యుఁ డతికష్టముగా ఈతను నేర్చుకొనును. కాని గోవత్సమునం దీగుణము జన్మముతోడనే కలుగుచున్నది. అట్లె మనుష్యుఁడు మిక్కిలి కఠినమగు యోగపరిశ్రమచేసి సిద్ధులను బొందఁగలఁడు. కాని దేవతలయుఁ బితరులయు యోనులలో నీ సిద్ధులన్నియుఁ బుట్టుకతోడనే కల్గుచుండును. దేవపితృయోనులకీ యెల్లసిద్ధులు గలుగుచున్నప్పుడాసిద్ధులలో నొక సిద్ధిమూలమున ననేక రూపములను ధరింపవచ్చును గదా! దీనింబట్టి యిప్పుడొక పితరుఁడు పెక్కురూపములను దాల్చి శ్రాద్ధమునకు సంప

దించినట్టి సమస్త ప్రదేశములకును నేకకాలమందుఁ జేరఁగలఁడని సిద్ధించినది.

ఇఁకను మనుష్యాది యోనులలోఁ బ్రవేశించియున్న పితరులకు, వారియోనుల కీశ్వరునిమూలమున శ్రాద్ధఫలమందఁ జేయఁబడును. ఈ లోకమునందు మరణించి యితర యోనుల యందుఁ బ్రవేశించియున్న జీవుని కర్మఫల మీశ్వరుఁడు తన శక్తిచేత నందఁజేయుచున్నచో శ్రాద్ధకర్మఫల మీశ్వరుని ద్వారమున నందుట యసంభవమని యెవఁడనఁగలఁడు? సంభవముగానిమ్ము - కాక పోనిమ్ము - అందనిమ్ము - అందకపోనిమ్ము - ప్రతివాదుల కిద్దానివలన నెట్టి ప్రయోజనములేదు. ప్రతివాద మొనర్చుటయే ప్రయోజనము. ఆ ప్రతివాదమైనను రెండు నిమేషములలో ఖండింపఁ బడఁగలదు. ఈ ప్రశ్నపై లేవదీసిన వితండావాదమును వేదశాస్త్రములు సంస్కర్తలు నోరు మెదల్పకుండునట్లు తుత్తునియలు గావించినవి.

ఎవరో యొకరు ఉచ్ఛిష్టమును భుజించుట దోషముగాదా?

(౧౨) కొందఱు మహాశయులు తొలుత బితరులు భుజించి పోయినయెడల బ్రాహ్మణులు వారి యుచ్ఛిష్టమును భుజించిన వారగుదురు. లేదా ప్రథమమునందు బ్రాహ్మణులే భుజించి పోయినయెడలఁ బితరులు వారి యుచ్ఛిష్టమును దిన్న వారగుదురు.ఉచ్ఛిష్టమును భుజించుటదోషావహమై ధర్మశాస్త్రములచే నిషేధింప బడినదిగదా? యని యడిగెదను. బాగు బాగు.

నేటికి సంస్కారులు ధర్మశాస్త్రములను నమ్ముట పరమానందకరమగు సంగతి. వీరిప్పుడు వానిని నమ్ముటకుఁ గార

ర్ధము మిథ్యయని నిరూపించుటకొఱకే యని తోఁచు
ధర్మశాస్త్రములు మృతక పితృశ్రాద్ధము విహితమని
ైన సమయమందా శాస్త్రములనుండి మీరు పెడ
, బెట్టెద రెందులకు? ఒకచోట వానిని బ్రమాణముగా
ుటయు, మఱియొకచోట నవి ప్రమాణములు గావని
యుటయుఁ జూచినవారికే సంస్కారుల నాస్తికత గోచ
రిదా? ధర్మశాస్త్రములు మనుష్యుల యెంగిలినా? పిత
ంగిలినా? నిషేధించినది. ఈ విషయము గూడ గుర్తె
ంసి యుండెను. ఏ సంస్కారుడైనను ధర్మశాస్త్రము
స్త్రి తను మనస్సుతోడనే యెల్ల యుచ్ఛిష్టములను దినుట
చినచో నీ దశయందొక వారములో సంస్కారి బృంద
'వసానము సంభవింపఁగలదు. ఇది విశదీకరింపఁబడును.
ర్తలు, భోజనమును సిద్ధముచేసి కొలఁది కాలములోనే
కుండిరి. సిద్ధము చేయఁబడెడి యీ భోజనముమీఁద నొక
వచ్చి కూరుచుండి యెంగిలి చేసిపోయెను. ఇంకేమి
ది? భోజన ముచ్ఛిష్టమయ్యెను. సంస్కర్తలు యుచ్ఛిష్ట
దినఁజాలరు. అందువలన వారు దిరిగి భోజనమును
జేసికొనిరి. కాని యట్లే తిరిగి యుచ్ఛిష్టమయ్యెను. ఈగ
ంగిలి చేయఁబడని భోజనము దొరకజాలఁదని దీనిభావము.
ర్త లుచ్ఛిష్టమైన హేతువుచే భోజనమును జేయక
రయెడల వారి శరీరముల కొక వారములోపల నవసానదశ
వని వ్రాయుచ్చెద. అప్పుడు సంస్కర్త యగు వాఁడే
ఁడని వ్రాయుచున్నందులకుఁ జింతిల్లెద. ఇఁక నాస్తికత

యెందుండును? భళీ : మంచి శంక శంకించితిరి! మీ వాదమును మీరే నిర్మూలించు కొనుచున్నారు. మఱియు ప్రపంచములోని మనుష్యులు, గ్రక్కినదానిని గూడఁ దినుచున్నప్పు డీక నెంగిలిని మాత్రమే వదలుకొందురని యెట్లు చెప్పుటకు వీలున్నది? వీ రితరుల వమనమును గ్రోలుచున్నప్పుడు వీరి యానందమునకు మేరయుండదు. వీరా వమనపదార్థమును నితరములగు తియ్యని పదార్థముల కుపమించి యెక్కువగాఁ బొగడెదరు. దీనిని వివరించెద. మక్షికములు పూలపై వ్రాలి వానిరసము నాకర్షించి యద్దానిని గొని తన గృహమందుఁజేరి కూరుచుండి తిరిగి యా రసమును గ్రక్కివేయును. అట్లు చేయఁబడినది తేనె యందురు. ఈ మనుష్యులవలన నా తేనె వదలబడుటలేదు. మక్షికముల వమనము గ్రోలుట ధర్మమై పితరుల యుచ్ఛిష్టమును దినుట యధర్మమైనదా? భళీ: బలే ధర్మశాస్త్ర విదుఁడవు బయలుదేరినావు! ఇతరముల యుచ్ఛిష్టమును దినుట నాక్షేపింపక పితరుల యుచ్ఛిష్టమును దినునప్పుడే నాక్షేపించెదవా? పైవానిని మానుకొని పితరుల యుచ్ఛిష్టము నాక్షేపింపుము. అప్పుడు సంస్కర్తల సమర్థత లోకమునకుఁ దెలియగలదు.

## పునర్జన్మము నమ్మెడివారికి శ్రాద్ధమవసరమా?

పునర్జన్మముచెప్పెడి గీతాశాస్త్ర భాగవతాది గ్రంథములు, పురుగు, తృణమును ముందటికాళ్ళతోఁ బట్టికొని వెనుకటి కాలిని లేవఁదీసినట్లే మనుష్యుని యాత్మగతియు నుండు

నని నుడువుచున్నవి. అది సత్యమైన యెడల శ్రాద్ధమున కవసర మేమియని కొందఱు ప్రశ్నింతురు.

ప్రత్యుత్తరము. ఇచట శ్రీమద్భాగవతమునుగూడ మన సంస్కర్తలు ప్రమాణముగా గ్రహించిరి. కాని భాగవతాది గ్రంథములు నుడివెడిమాట సత్యమైనయెడల, యనియందురు. ఇంతవఱకు వీరు సత్యాసత్యజ్ఞానమే సంపాదింపకపోయిరి. వీరికి చదువువచ్చియుండును. అట్లు చదువఁజాలినచో ఛాందోగ్యోపనిషత్తులోని పంచాగ్ని మహావిద్యనుండి జాడదీయఁగల్గుదురు. కాని పాపమేమి చేయఁగలరు? అందు గతిలేకయున్నారు. శరీరము విడువకముందే మరియొక శరీరము దొరకుచున్నదనెడి విషయము వాస్తవమేయని యంగీకరింతును. కాని యీ క్రొత్తగాఁజిక్కిన శరీరమునందు శ్రాద్ధఫలము చేరుట కేశాస్త్రమైన నిషేధించినదా? శ్రాద్ధఫలము నూతన శరీరమునందే సంక్రమించును. ఇందులకు "యేనపితాః" మొదలగు వేదమంత్రములును దేవలస్మృతియును నింతకుమున్నే ప్రమాణములుగాఁ జూపఁబడియున్నవి. వేదమును దేవలస్మృతియు సంస్కర్తలకు దృష్టిగోచరమైనచో వారిట్టిపనికి మాలిన ప్రశ్నను బ్రశ్నింపక పరిహాసాస్పదులుగా కుండెడివారు.

సర్వేశ్వరుఁడు సర్వులను బోషించుచుండ శ్రాద్ధమవసరమా?

(౧౮) ప్రతి శరీరధారికిని భరణ పోషణములను బరమాత్మ పుట్టుకకు మునుపే శిశువునకుఁ దల్లిస్తనములయందు

పాలేర్పాటుచేసిన ట్లేర్పరచియుండెను. ఇంకనిట్లే యెవఁడైనఁ బితృయోని గలవాఁడున్నయెడల వాని కన్నపానీయములను గూడఁ బరమేశ్వరుని పక్షమునఁనేర్పడగలదు. అత్తటి శ్రాద్ధ మాచరించినందునవలన లాభమేమి? బ్రాహ్మణుల ముఖమున వారి కన్నమునందఁజేసి తృప్తినిగూర్చుట కెట్టి ప్రమాణముగలదు. అని మరికొందఱడిగెదరు.

ప్రత్యుత్తరము. ఈశంకయందు వారు శ్రాద్ధమే ఖండించుటలేదు. కాని ప్రపంచమందున్న సంస్కర్తల వృత్తి వ్యవహారములను గూడ మాన్పివేయుచున్నారు. మీరు పరమేశ్వరుఁ డెల్లవారి భరణపోషణములకుఁ దగిన యేర్పాటుచేయుచుండెను. తిరిగి శ్రాద్ధమున కవసరమేమని? యడుగుచున్నారు. సర్వేశ్వరుఁడు పితృయోనియందు భరణపోషణములకుఁ దగిన యేర్పాటు చేసినట్లే మనుష్య యోనియందుఁ గూడఁ బరమేశ్వరుండు భరణ పోషణముల నేర్పరచుచున్నాఁడని మాత్రమే తప్పక ప్రత్యుత్తర మిచ్చెదము. ఇది తల్లి స్తనములయందు పాలు జనించుననెడి యుదాహరణమును గైకొనిన మా ప్రతివాదులకు గూడ సమ్మతమైనది. కాఁబట్టి సంస్కారు లీశ్వరుని యేర్పాటు తప్ప నితర ప్రయత్నములన్నియు వ్యర్థములని తలంచునట్టి వారైనపుడు తిరిగి మనుష్య యోనులయం దనేక విధములగు వృత్తుల నెందుల కవలంభింతురు? కొందఱు కొలువును గొందరు భూస్వామిత్వమును, గొందరు వ్యవసాయమును, గొందరు వర్తకమును, జేయుచున్నారుగదా. పరమేశ్వరుఁడు ముందే యేర్పరచియుండెను. తిరిగి వీరు ప్రయత్నించుట వ్యర్థమగును. కాఁబట్టి సంస్కా

రులు వృత్తి వ్యాపారాములను వదలిపెట్టి చేతిపై జేయివేసికొని నిశ్చింతగా గూరుచుండి యున్నప్పుడే సనాతనధర్మీయులు గూడ శ్రాద్ధమాచరించుట మానివేయగలరు.

మహాభారతము శ్రాద్ధమును నిషేధింపలేదా?

(౧౫) మహాభారతమునందు శ్రాద్ధము నిషిద్ధమని వ్రాయబడి యున్నది. కనుఁడు . అనుశాసనపర్వమందలి ౯౧ వ యధ్యాయములో నిమి మహర్షి తనపుత్రుడు మరణించినమీఁదఁ దోలుతశోక మోహాములచే వ్యాకులపడి శ్రాద్ధమాచరించెను. పిదప నతఁడు తెలివికి వచ్చినప్పుడు క్షోభించి నేననర్థకార్య మొనరించితిని. ఇట్టి యకార్య మీకాలమున నెవరుగూడఁ జేసియుండరు. ఈమాటలు బ్రాహ్మణులు విన్నయెడల నన్ను శపింపఁగలరు. ఈ యభిప్రాయములఁ దెలియజేయు శ్లోకము విని, కనుఁడు.

"తత్కృత్వాతు మునిశ్రేష్ఠో, ధర్మసంకటమాత్మనః।
పశ్చాత్తాపేన మహాతా, తప్యమానోభ్య చింతయత్॥
అకృతం మునిభిః పూర్వం, కిం మయేద మనుష్ఠితం।
కథ న్నశాపేన నమాం, దహే యుర్బ్రాహ్మణా ఇతి॥

ప్రత్యుత్తరము: సంస్కర్తల కసత్యమును జెప్పుటయు వ్రాయుటయుఁ బరమధర్మమై యున్నది.ఎంతవరకు వీరసత్యమనెడి కళంకమునాపాదింపరో యంతవఱకును వీరిమనము ప్రసన్నముగా నుండఁజాలదు. దయానందస్వాములు భాగవతమనెడి నామముతో స్తంభమున కగ్నివలన నుష్ణమును గలిగించుట, దానిపై ఈశ్వరునివలనఁ జీమలబారు నడుచుట, ప్రహ్లాదుఁడు

చూచుట లోనగు నసంగతాన్నృతవచనములను సంగతులను వ్రాసినట్లే యీ సంస్కర్తలయొక్క శ్రాద్ధనిషేధము మహాభారతమునందుఁ జూపించుట పదార్ణాలును మిథ్యయని నిరూపింతును. మహాభారత మిద్దానింగూర్చి యేమి వ్రాయుచున్నదో విచారింపుఁడు.

"స్వాయంభువోఽత్రిఃకౌరవ్య పరమర్షిః ప్రతాపవాన్।
తస్యవంశేమహారాజ:దత్తాత్రేయ ఇతిస్మృతః ॥౪॥
దత్తాత్రేయస్యపుత్రోఽభూన్నిమిశ్శ్రేష్ఠస్తపోధనః।
నిమేశ్చాప్యభవన్పుత్రశ్శ్రీమాన్నామశ్రియావృతః ॥౫॥
పూర్ణేవర్షసహస్రాంతే సకృత్వాదుష్కరం తపః।
కాలధర్మపరీతాత్మానిధనం సముపాగతః ॥౬॥
నిమిస్తు కృత్వాశౌచాని, విధిదృష్టేన కర్మణా।
సంతాపమగమత్తీవ్రం, పుత్రశోకపరాయణః ॥౭॥
అధకృత్వోపహార్యాణి, చతుర్దశ్యాం మహామతిః।
తమేవగణయన్ శోకం, విరాత్రేప్రత్యబుధ్యత ॥౮॥
తస్యాసీత్ప్రతిబుధ్యస్య, శోకేన వ్యధితాత్మనః।
మనస్సంహృత్యవిషయే, బుద్ధిర్విస్తారగామినీ ॥౯॥

ఓజనమేజయా, స్వయంభువు అగు బ్రహ్మకుఁ బ్రతాపవంతుండగు అత్రియు, అతనికి దత్తాత్రేయుండును, దత్తాత్రేయునకు నిమియను తనయుఁడు జనించెను. నిమికిఁ దేజోవంతుండును, శ్రీమతుండను పేరుగల కుమారుఁడు పుట్టెను. ఆశ్రీమంతుండొక వేయిసంవత్సరములు దుష్కరమగు తపస్సుచేసి దైవవశమున మరణించెను. ఇతని తండ్రియగు నిమి శౌచక్రియాదులఁజేసి విధి

(బ్రహ్మ) చోదితమగు ఈపుత్రశోక రూపకర్మముచేత దుఃఖితుఁడయ్యెను. చతుర్దశియందు శ్రాద్ధాదుల నొనరించి నిద్రించి వేకువను మేల్కొనినప్పుడు తెలివివచ్చెనని యర్థము. ఇదియంతయు బూర్వగాథ.

దీనితరువాతకథ యిది. రాజు నేనే శ్రాద్ధమాచరించితినో యది వ్యర్థము. విధిరహితమైనది. అమావాస్యనాఁడా శ్రాద్ధమాచరింపవలసియుండెను. కాని పుత్రశోకముచే స్మృతితప్పి చతుర్దశినాఁడే దానిని జేసితినని పశ్చాత్తాపపడఁ దొడంగెను. ఇందులకు సంస్కర్తలుమీదఁ జూపిన "తత్కృత్వాతు మునిశ్రేష్ఠ" అకృతంమునిభిః, అనెడి శ్లోకములవలఁ కర్థమేమనఁగా నిమిరాజు, ధర్మసంకటములోఁబడి మిక్కిలి దుఃఖించుచు "అయ్యో! ఇట్లింతవరకు నెవరుగూడఁ జేసియుండలేదు. ఇట్టియవిధిని విని యిట్లు చేయఁగూడని పని చేయఁబడినదని బ్రాహ్మణులు నన్ను శపింతురో యేమో యని భయపడి పశ్చాత్తాపముతో విచారింపఁదొడంగెను. ఇద్ది మహాభారతములోనిది.దీనినే సంస్కర్తలు తలక్రిందులు చేసిరి. ఇట్టిమోసములతో నెన్నినాళ్ళు వీరి నాయకత్వము నడచునో గదా!

### మృతకశ్రాద్ధ మిటీవల వచ్చినదిగాదా ?

(౧౬) మృతకశ్రాద్ధము మొట్టమొదట లేకుండెను. తరువాత కరణుఁడనువాఁ డిది నడిపెను. ఇందువలన దీనికి "కనాగత" మనిపేరు గల్గినది. అనఁగా కర్ణుఁడువచ్చి యిది ప్రారంభించియున్నందువలన కరణాగతమని పిలువఁబడినదని యెరుంగవలెను.

కరణాగతముయొక్క యపభ్రంశమే కనాగతమైనది. దీనింబట్టి యింతకుఁ బూర్వమున్న పితరు లందఱును నరకములోనే పడి పోయినారా యేమని మన ప్రతివాదు లడిగెదరు.

ప్రత్యుత్తరము:—సంస్కర్తల యీ శంకగూడ పదియా ఱణాలును ననృతమైయున్నది. మహాభారతములో నేస్థలమందుఁ గూడఁ గరణుఁ డనువాఁడు మృత్యువునుండి మరలివచ్చెనని కాని వచ్చి యతఁడు మృతకశ్రాద్ధ మారంభించెనని కాని యీ హేతు వుచే నీ శ్రాద్ధము కరణాగతమనియో కనాగతమనియో పిలువఁ బడుచున్నదని కాని కరణుఁడు మృత్యువుచేఁ దొలుత నిది మొదలు పెట్టించినాఁడని కాని యెంతమాత్రమును లేదు. ఒక మహాభారతగ్రంథమదే కాదు, మఱి యే యితర గ్రంథమందుఁ గూడ నీకథాసంగతి వ్రాయఁబడలేదు. ప్రతివాదు లిట్లు వ్రాయు టకు మూలము నిర్మూలమని సర్వవిధములను గ్రహింతురుగాక.

కరణాగతమనెడి పదమున కపభ్రంశముకనాగతమనికాదు. ఇఁకేమన? శరదృతువుతోఁ గూడిన మాసమునందు (ఆంధ్రదేశ మందు వర్షర్తువుతోఁ గూడిన భాద్రపద బహుళమగును) జరి గెడి శ్రాద్ధము సర్వదా సూర్యుఁడు కన్యారాశిగతుఁ డైనప్పుడు సంభవించుచుండును. ఈ కారణముచేత నీ శ్రాద్ధమునకు కన్యా గత శ్రాద్ధమని పేరువచ్చినది. ఆ కన్యార్కగత శబ్దమునకే యప భ్రంశముగా "కనాగత" మైనది. సమస్త వేదశాస్త్రములును కన్యార్కగత శ్రాద్ధము సలుపవలసినదని వ్రాయుచున్నవి. విలో కింపుడు.

"ఇందు క్షయే మాసిమాసి, ప్రాయశ్చిత్తీభవేత్తు సః
సూర్యే కన్యాగతే కుర్యాచ్ఛ్రాద్ధం యో
న గృహాశ్రమీ॥ ౩౫౭

ధనంపుత్రాః కులంతస్య, పితృనిశ్శ్వాస పీడయా
కన్యాగతే సవితరి, పితరోయాన్తి తత్సుతాః"॥ ౩౫౮

ప్రతి మాసమందలి యమావాస్యనాఁడు శ్రాద్ధము చేయనివాఁడు ప్రాయశ్చిత్తమునకుఁ బాత్రుఁడగును. సూర్యుఁడు కన్యాగతుఁడై నప్పుడు శ్రాద్ధమాచరింపని గృహస్థునియొక్క ధన సంతానకులములు పితరులయొక్క దీర్ఘనిశ్శ్వాసము నష్టము లగునని యర్థము. దీనినే పాణిని మహర్షులవారిట్లు లిఖించు చున్నారు.

"శ్రాద్ధేశరదః. ।౪।౩।౧౨। ఠఞ్ స్యాత్। ఋత్వణోఽప వాదః। శరదిభవం శారదికం। శ్రాద్ధం।"

శ్రాద్ధమనెడి యర్థమందు శరచ్ఛబ్దమునకు ఠఞ్ ప్రత్యయ మగును. ఋత్వర్థమందు వచ్చెడి 'అణ్' ప్రత్యయమున కిది యపవాదము. శరత్కాలములో జరిగెడి శ్రాద్ధమునకు "శార దిక" మని నామము. వేదాదిశాస్త్రములందింక నిట్టి ప్రమాణము లనేకములు గలవు. వీనివలన రవికన్యాగతుఁడైనప్పుడు సంభ వించెడి మాసమందు జరుపుదానికి కన్యాగత మనియు దాని యపభ్రంశమే 'కనాగత' పదమైనదనియు మిక్కిలి చక్కఁగా సిద్ధింపఁగలదు. ఆ కరణుఁడు చచ్చి తిరిగివచ్చి శ్రాద్ధమారంభించె ననెడి కథ నీకనట్లుంచుఁడు. ఈకథయంతయు సంస్కర్తలు

స్వయముగాఁ గల్పించినదియేకాని వేఱొండుగాదు. ఏగ్రంథ మందుఁగూడ నిది వ్రాయఁబడి యుండలేదు.

ప్రతిసంవత్సరమందును శ్రాద్ధము చేయవలెనా?

(౧౭) మనుస్మృతి మూడవయధ్యాయములోని ౨23 వ శ్లోకమునందు మనుజులయొక్క యన్నమువలన నొకకల్పముదాకఁ దృప్తి గలుగునని వ్రాయఁబడియున్నది. ఇట్లున్నప్పుడు ప్రతి సంవత్సరమందును శ్రాద్ధముచేయవలసిన యవసరమేమివచ్చినది? అని సంస్కారి శిరోమణులు కొందఱు ప్రశ్నింతురు.

ప్రత్యుత్తరము: ఇది కేవలము సంస్కారులయొక్క వంచన కార్యమేకాని వేఱుగాదు. మనుస్మృతి, కల్పమువరకనెడి యెట్టి ప్రసంగమునుగూడఁ దీయలేదు. దీనియందుఁదుదకు 'కల్ప' నామముగూడలేదు. ఇఁక వీరెందులకిట్టి మిథ్యాశంకలను వేయునది తెలియరాకున్నది. దీనింబట్టి వీరనృతములను వ్రాయుటయు మోసగించుటయు దేశోన్నతి ప్రదంబులని తలఁచినట్లు తోచుచున్నది. ఇట్టి మిథ్యావాదులకేనా యున్నతాసన మొసంగి లోకము ధర్మబద్ధమగునది! శహబాస్! ఒకవేళవారు చెప్పినట్లది యందున్నదని కల్పించుకొని యొప్పుకొనినప్పటి కద్దానికిఁకముందు శ్రాద్ధమును జేయఁగూడదని యర్థమగునా? వేదాదిశాస్త్రములు ఫలశ్రుతిం జెప్పి మనుష్యునిం గర్మమందుఁ బ్రవర్తింపఁజేయును. కనుఁడు. "స్వర్గకామోగ్నిష్టోమేనయజేత" యనెడి శ్రుతి స్వర్గమందపేక్ష గల్గించి యగ్నిష్టోమ యజ్ఞమందు మనుష్యునిఁ బ్రవర్తింపఁజేయుచున్నది. దీనిపై నెట్టిశంకయు లేదుగదా. లేనప్పుడిఁక ఫలశ్రుతిద్వారముల ధర్మశాస్త్రములు కర్మమందుఁ బ్రవర్తింపఁ

ప్పుడిట్లు శంకించుట యెందులకు? దీనింగుఱించి యే
న నెప్పుడైన విచారించునా?

కాకులకును పితరులకును సంబంధమున్నదా?

౯) కాకులకును బితరులకును సంబంధమేమి గలదు?
కుక్కలును బితరుల కన్నము నందఁజేసెడి యమ
ిరి బంటులని సనాతనధర్మీయులు తలంచుచున్నారా?
ందరు సంస్కర్తలనుచున్నారు.

ప్రత్యుత్తరము:—సంస్కర్తలు తమ గ్రంథములనుగూడ
ండలేదు. గుర్తెరిగి యుండినచో నీ ప్రశ్ననే ప్రశ్నిం
లకనంగా దయానందస్వాములు గూడ "బలివైశ్వ
ముందుఁ బ్రతిదినము కాకులకును, గుక్కలకును, బలి
దని వ్రాసియున్నారు. వ్రాసియున్నప్పుడా స్వాము
చుట్టరికముగల యీ శంకరాదా? ఒకానొక సోద
ానందస్వాము లద్దానిని రక్షకొఱకు వ్రాసియున్నారని
ము. కాని యాస్వామివారు గోవులు, బఱ్ఱెలు,
నుగులు, గుఱ్ఱములు, మున్నగువానిలో నొకదానినిఁ
ముక కేవలము కాకులకొఱకును, గుక్కలకొఱకును,
ంబట్టి యందవస్య మొక రహస్య మేదోయుండి
ాహింపవలసి యున్నది.

సనాతనధర్మమందున్ననో శ్రాద్ధమునందుఁ బ్రాహ్మ
ూడఁ గాకులకును, గుక్కలకును, భోజనము పెట్ట
సనాతన ధర్మగ్రంథములగు వేదాదిశాస్త్రములలో

నొకదానియందును వ్రాసియుండలేదు. ఈ కారణమువలననే ప్రతివాదు లొక్కప్రమాణము గూడఁ జూపియుండలేదు. ఇంత మాత్రమేకాదు. ముందింకొకఁడు గూడ నీ విషయముపై లేఖిని (కలము) నెత్తి వ్రాయఁజాలఁడు.

ప్రతివాదులు లోకము దాని నాచరించుటం జూచి యీ శంకను వేసిరే. కాని సనాతనధర్మీయులు కాకుల కన్న మెందులకుఁ బెట్టెడి సంగతిని దెలిసికొని యుండలేదు. ఇందువలననే వీరీ ప్రశ్న మును వేసిరి. కాన నిందులకు సరియగు సమాధాన మిచ్చెదను. గ్రహింపుఁడు. సనాతనధర్మీయు లా సామాజికులు వ్రాసినట్లు పై రెండు కారణములచే నన్న మొసంగుట లేదు. కాని దీనికొక విశేష కారణమున్నది. అదేదనెదరా ? సనాతనధర్మీయు లంద ఱాస్తికులు. వీ రార్యసామాజికులవలెఁ దమ ధర్మగ్రంథములపై కత్తెర దీసికొని పఱుగిడరు. మను భగవానుడు నిత్యకర్మ విషయ మం దిట్టుల వ్రాయుచున్నాఁడు.

"శునాంచపతితానాంచ, శ్వపచాం పాపరోగిణాం।
వాయసానాం కృమీణాంచ, శనకై ర్నిర్వపే ద్భువి॥
మను॥ ౩॥౯౨

కుక్కలకును, పతితులకును, చండాలురకును, పాపుల కును, రోగులకును, కాకులకును, పురుగులకును, భాగముల నేర్పఱచి భూమిపైఁ బెట్టవలసినదని యర్థము.

దీనికి ముందున్న శ్లోక మెల్లభూతములకొఱకు బలిప్రదాన మును జేయవలసినదని నుడువుచున్నది. దీని తరువాతనున్న శ్లోకములో భూతముల (ప్రాణుల) కొఱకు బలిప్రదానమొసం

గెడివారు మోక్షమును బొందెదరని లిఖింపఁబడినది. మనుస్మృతి
లోని యీశ్లోకమును గైకొనియే స్వామిదయానందులవారుగూడ
నార్యసామాజికుల నిమిత్తము బలిప్రదానమొసంగవలసినదిగా
వ్రాసియుండిరి. కాని యిప్పటి సామాజికులాదయానందస్వాముల
వారికంటెఁ దామధికవిద్వాంసులమని తలఁచిన కారణమున నా
స్వామివారి వ్రాతను జటికెలమీఁద నెగురగొట్టిరి.

ఏయార్యసామాజికుఁడైనను సనాతన ధర్మీయులు ప్రతి
దినమందు బలి ప్రదానమెందులకుఁ జేయరని ప్రశ్నించినయెడలఁ
దిరిగి యార్యసామాజికులు ప్రతిదినము సంధ్యావందన మెందుల
కాచరింపరని యడుగుఁడు. శ్రీస్వాములవారార్య సామాజికుల
నుద్దేశించి వారికొఱకు విధవావివాహము మాత్ర మాచరణీయ
మని వ్రాసియున్నారా? మాలమాదిగలతోఁ గలసి భుజింప
వలసినదిగా మాత్రమే వ్రాసియుండిరా? స్వామివారు నిత్యము
సంధ్యావందనము చేయవలసినదని వ్రాయలేదా? గురువులు
చెప్పినట్లు శిష్యులగు ఆర్యసామాజికు లేలచేయరు? చేయకపోవుట
యేగాక యితరుల నాక్షేపించుట యెందులకు?

ఇఁక సనాతనధర్మీయుల విషయమును వినుఁడు. పంచమహా
యజ్ఞములను జేయు సనాతన ధర్మీయులు ప్రతిదినమందుగూడ
భూతబలినొసంగుచున్నారు. వీరిలోఁగొందఱకు మూఢత్వమున్న
కారణముచేతనో, స్వభావముగా నున్న సోమరితనముచేతనో,
ప్రతిదినము పంచమహాయజ్ఞములం జేయరు. ఇట్టి వారా పంచ
యజ్ఞములలోఁ జేరిన యీబలి ప్రదానముగూడఁ జేయరు. కాని

శ్రాద్ధదినమందా పంచయజ్ఞములందప్పక చేయుదురు. అందువలన నాఁడు బలి ప్రదానముగూడ నొనర్తురు.

వర్షర్తువు నందుఁగూడఁదర్పణము విడువవలెనా?

(౧౯) వర్షర్తువులో వచ్చెడి ఆశ్వీజమాసమునందు బావులు, గుంటలు, చెరువులు, ఏళ్లు, కాలువలు, నదులు, నీళ్లతోనిండియుండును. అప్పుడు తర్పణముల కేమియవసరము? పితరులు స్వయముగానే యే జలాశయములోనో జలమును త్రాగఁగలరుగదా. కాని వైశాఖమాసముగల గ్రీష్మర్తువులోఁ బితరులకెచ్చటగూడ నుదకము దొరకదు. ఇందువలన నాపితరుల గొంతుకఎండి క్రమముగా వారిప్రాణము లెగిరిపోఁగలవు. అప్పుడే సనాతన ధర్మియుఁడును వారికిఁ దర్పణజలము నిచ్చుటలేదేయని మఱియొక సంస్కారి ప్రశ్నించుచున్నాఁడు.

ప్రత్యుత్తరము:— ఈ యార్య సామాజిక సంస్కారి యాశ్వీజమాసమందు వర్షర్తువును, వైశాఖమాసమందు గ్రీష్మర్తువును జదివియున్నాఁడు. ఇతఁడు యూరోపునందు జదివి యిచ్చటికి వచ్చినాఁడని తెలియుచున్నది. ఎందులకనఁగా భరత వర్షములోని యెల్ల గ్రంథములు నాశ్వీజమాసమును శరదృతువు లోనిదనియు వైశాఖమాసము వసంతర్తుతువు లోనిదనియుఁ దలఁచి వ్రాసియుఁ గూడ నున్నవి. కాని సంఘములం (సొసయిటీలం) దిట్టి యిట్టి వైదుష్యమున్నదని యంత యని కొనియాడఁ గలము! నిజముగా సామాజికుఁడు చదివి వ్రాయఁజాలిన వాఁడైనచో నీశంకనే వేయఁడు. సనాతన ధర్మగ్రంథములన్నియు నిత్య

ముతర్పణములను జేయవలసినదని వ్రాసియున్నవి. ఒకటిగూడ ఆశ్వీజమాసమునందే చేయవలసినదని వ్రాసియుండలేదు. ఒక రిరువురుగారు లక్షలకొలఁది మనుష్యు లట్లాచరించుచున్నారు. వారు నిత్యమును తర్పణాదులేల గావింపరని యడిగినచో నిందు లకు నే నాశ్వయుజములోఁ దర్పణాదులం జేయఁగూడదని యెందైన నిషేధమున్నదా ? యని సమాధానమిత్తును. ఒకఁడు రెండు కాలములంచుఁ జేయఁదగిన సంధ్యావందన మొకకాల మందే చేయుచున్నాఁడు. అప్పు డతఁ డొకకాలమందుఁ గూడఁ జేయఁగూడదా? రెండు కాలములందును సంధ్యావందన మాచ రింపక యుండుటకంటె నొక కాలమందైన నాచరించుట మంచిది గదా యని మీరన్నచో నప్పుడిక నాశ్వయుజమునందుఁ దర్ప ణాదులం జేయుట దుష్టమెట్లగును ? దినదిన మిట్లు చేయఁదగిన దని మీరు చెప్పినయెడల "కర్తవ్యము చాలమంచిది" 'అధికస్య అధికంఫలం' చాల బాగుగానున్నదని ప్రశంసింపఁగలను. కా యిది యార్యసామాజికులకు బహుదుఃఖ కరంబగును. వీరి బదునైదు దినముల తర్పణములోనే యింత గొప్పదుఃఖము కలిగినప్పు డికఁ బన్రెండు నెలల తర్పణమువలన నింకెంతదుఃఖము గల్గునో దాని గూడఁ గొంచె మాలోచింపవలసి యుండును.

"తృప్యన్తాం" అన్నంతమాత్రమున తృప్తిగలుగునా?

(౨౦) తర్పణసమయమందు "తృప్యన్తాం" అని చె చుందురు. తృప్యన్తా అని యన్నంతమాత్రానఁ బితరులకుఁ గలుగుచున్నదా? యని కూడ మన యార్యసామాజిక లడిగెదరు.

ప్రత్యుత్తరము:—పాపము! సామాజికులు మిక్కిలి యన భిజ్ఞులు. ఇతరులయొక్క ధర్మములను ఖండించుచు ఖండించుచు దానివెంటనే గురువర్యులగు స్వామి దయానందులవారిపై గూడ దిట్టమైనదెబ్బ దీయుచుందురు. తర్పణములో "తృప్యన్తాం" అన్న పదమొక సనాతనధర్మీయులే వాడలేదు. దయానంద స్వాములు గూడ "తృప్యన్తాం" అని చెప్పవలసినదిగా వ్రాసిరి. కనుఁడిటు. "ఓం బ్రహ్మదయో దేవాస్తృప్యన్తాం, బ్రహ్మదిదేవ పత్న్యస్తృప్యన్తాం, బ్రహ్మదిదేవ సుతాస్తృప్యన్తాం, బ్రహ్మది దేవగణాస్తృప్యన్తాం, ఇతి దేవతర్పణం॥"

నేను సత్యార్థప్రకాశములోని చతుర్థసముల్లాసములో నుండి కేవలమొక దేవదర్పణమునే వ్రాసితిని. దీనితరువాత వ్రాయఁబడిన ఋషితర్పణమునకు బితృతర్పణమునకుఁగూడ నొక్కొక్క వాక్యమునకు సైతము "తృప్యన్తాం" అని చేర్పఁబడి యున్నది. ఇరుతెగలవారుగూడ "తృప్యన్తాం" అనుశబ్దమునుచ్చ రించుచున్నప్పుడు 'తృప్యన్తాం, శబ్దోచ్చారణ ప్రశ్నమొక సనాతన ధర్మీయులనే యడుగుచుండుట యెందులకు? మీగురువులగు స్వాములవారి నడుగరెందులకు? ఇందులకుఁ బ్రత్యుత్తరమేమనగా ఈ సామాజికుఁడు తాను తెలివితక్కువ గలవాఁడై నప్పటికిని తనను విద్వాంసునిగాఁ దలఁచుకొనునట్టి భూత మావేసించి యున్నది. ఈకారణముచేత సనాతన ధర్మీయులతోఁబాటు దయానంద సరస్వతీ స్వాములఁగూడ మహామూర్ఖులని తలంచి వారి వ్రాతను జిటికెలమీఁదనే వారెగురఁగొట్టుచుండిరి.

## మహాలయ పక్షములో దీక్షతో నుండవలెనా ?

(౨౧) మహాలయపక్షమందలి శ్రాద్ధదినములలో క్షౌర మెందులకుఁ జేసికొనఁగూడదు? వస్త్రము లెందులకుఁ జాకలి వానిచే నుతికించుకొనగూడదు? మాసినవియుఁ జినిగినవియునగు బట్టలఁగట్టుకొనవలెనా? ఖరదూషణాసురుల వలె ముఖముల నుంచుకొనవలెనా? ఇట్లుండినంగాని పితరులు ప్రసన్నులుగారా? ఇది శాస్త్రవిధియా? యని మనప్రతివాదులు తిరిగి ప్రశ్నింతురు.

ప్రత్యుత్తరము: సమస్తయజ్ఞములందుఁగూడ యజమానునకు బ్రహ్మచర్యవ్రతముగలదు. బ్రహ్మచారికి క్షౌరముచేయించు కొనుట, చాకలిచే బట్టలనుతికించుకొనుట లోనగునవి పనికిరాని కార్యములు. ఇవి యజ్ఞకర్తకుఁగూడఁ బనికిరావు. దీక్షితుఁడగు వాఁడు క్షౌరముచేయించుకొనఁగూడదని వేదము "దీక్షితో దీర్ఘశ్మశ్రుః" అను మంత్రముతోఁ జెప్పుచున్నది. ఆశ్వయుజ మాసమునందు జరిగెడి పితృయజ్ఞమునందు దీక్షగలవానికి క్షౌరమున్నగునవి లేకుండుట సమంజసపద్ధతియేయని గ్రహింప వలెను.

## గయా శ్రాద్ధమైన తరువాతగూడ శ్రాద్ధమా?

(౨౨) గయాశ్రాద్ధమైనప్పుడా ఫలమువలనఁ బితరులు మోక్షమునే పొందుచున్నారుగదా. ఇక గయాశ్రాద్ధమైన తరువాతఁ దిరిగి శ్రాద్ధమెందులకుఁ జేయవలెనని కొంద అడిగెదరు.

ప్రత్యుత్తరము:— మొట్టమొదట విధియందెట్టిలోప మైనను గలిగియుండవచ్చు ననెడి సంశయము గలదు. ఈ లోప

మున్న కారణముచే మోక్షపదము దొరకక పోవచ్చును. గౌతమ మహర్షి, న్యాయదర్శనములోఁ గర్తయొక్క సామగ్రియందే విధమగు లోపము రానియెడలనే విధివలనఁ గలిగెడి ఫలము దొరకుననియుఁ గర్మమునందుగాని కర్తయందుఁగాని సామగ్రి యందుఁగాని యేవిధమయిన లోపము సంభవించినను ఫలము శూన్యమగుననియు నున్నది.

"న కర్మ కర్తృ సాధనవైగుణ్యాత్"

న్యాయ। ౨।౧।౫౯

కర్మ, కర్తృ, సామగ్రుల వైగుణ్యమువలననే విధికి మిథ్యాత్వదోషము సంభవింపదు. ఇందులకు భిన్నముగా మోక్షము గల్గినమీఁదఁ గూడ శ్రాద్ధ మాచరించినయెడల నేమి హానిగలుగును? పితరులకు మాత్రము మోక్షము గల్గెనుగదా. ఇఁక నీ శ్రాద్ధఫల మెవరికిఁ గలుగునని మీరు ప్రశ్నింపవచ్చును. ఇందులకు, ప్రత్యుత్తరమేమన, వేదోక్తమగు పద్ధతిని నెరవేర్చిన పిమ్మట శ్రాద్ధకర్తకు ఫలము నందఁజేసెడి విధి ననుసరించి యా ఫలము శ్రాద్ధకర్తకే చిక్కునని గ్రహింపలెను.

సంతతిలేని పితరులు నరకమునకుఁ బోదురా?

(౨౩) ఎవరికి సంతతిలేదో, సంతతి లేకపోవుటచే శ్రాద్ధ తర్పణము లెవరికి జరుగుటలేదో, యా పితరులందరు నరకమునకే పోయినారా? యని యార్యసామజికులును, సంస్కర్తలును మఱఁడఁ బ్రశ్నింతురు.

ప్రత్యుత్తరము:—మనుష్యు లూర్ధ్వరేతస్కులు మున్నగు
రై మోక్షసాధనముల నందుకొనఁ జాలనివారై నప్పుడును
కిఁ బుత్రపుత్రికాదులు లేనప్పుడును, పుత్రాదులున్నప్పటికిని
శేసామాజికులయందో చేరి శ్రాద్ధాదులను జరుపని తరుణ
మును ఆ పితరులకు మోక్షమసంభవమే యగును. పితరులు
కర్మములవలనఁ బొందిన శరీరములలో సుఖించుటకొరకు
కార్యము (తోడ్పాటు) గల్గుట శ్రాద్ధఫలమై యున్నది.
ద్ధమెవనికి జరుగదో వానికిసుఖసాహాయ్యముగలుగదు. శ్రాద్ధ
చరింపకపోయినచో నిట్టినష్టము సంభవించునని ముమ్మా
గ్రహింపుండు.

ఉ ప సం హా ర ము.

పాఠకవర్యులారా! ఆర్యసామాజికులు, సంఘసంస్కర్తలు
నవ నాగరకులు మున్నగు మన సోదరులు వేదశాస్త్రవిహిత
తక శ్రాద్ధముపై వితండాత్మకమైన ప్రశ్నల నొకవందనువేసిరి.
వలన బ్రతికియున్న ఇతరులయు, మృతులగు పితరులయు
ద్ధములు రెండుగూడ ఖండింపఁబడుచున్నవి. కాని యీ
స్సారములని నమ్ముదురుగాక. వానియందెట్టి గొప్పతనమును
ను. సాధారణ మనుష్యుఁడుగూడ సులువుగా నాప్రశ్నలకుఁ
త్యుత్తరము లొసంగఁగలఁడు. అయినను వానిలోఁ గఠినము
న ప్రశ్నముల కన్నిటి కీగ్రంథమందు సమాధానములన
స్త్రీయుక్తి ప్రమాణకారణములతో నిచ్చియున్నాన
లభముగానున్న వానిని విడిచిపెట్టితిని.

ఈ గ్రంథమంతయు జక్కఁగాఁ జదివి బోధపరచుకొని బ్రతికియున్నప్పుడు వారి యాజ్ఞలకు లోఁబడి ప్రవర్తించుటయు, మరణించిన తరువాత వేదోక్తవిధిని నా పితరులకు శ్రాద్ధతర్పణాదుల నొనరించి కృతార్థతజెందుటయు ప్రతిమనుష్యునకు విహితమైనదనియు, వేదవిరోధుల మోసములకుగాని యాశలకుగాని పేరునకుఁగాని లోఁబడక సనాతన ధర్మమార్గమునఁ బ్రవర్తించుట శ్రేయోదాయకంబనియు విన్నవించుచు విరమించుచున్నాఁడను.

"ధర్మ ఏవ హతో హంతి, ధర్మో రక్షతి రక్షితః"

సంపూర్ణము.

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

---

జానకిరాం ప్రెస్, తెనాలి.